









# మహిళలు

## విలువ,ధర్మాలు

# మనం మన సంస్కృతి







## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మనం మన సంస్కృతి

మల్లాది సుబ్బమ్మ

మల్లాది పబ్లికేషన్సు
9, ఎం. ఐ. జి. హెచ్. మెహిదీపట్నం,
హైదరాబాద్-500 028

# ఇదీ వ్యాసాల వరుస


| | | పుట |
|---|---|---|
| 1. | నలభైఏళ్ల స్వాతంత్ర్యానంతరం స్త్రీల స్థితి | 3 |
| 2. | భారతనారి: నాడు, నేడు, రేపు | 9 |
| 3. | స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీలు | 15 |
| 4. | సంఘ సంస్కర్త - సంఘ సేవిక - ఉన్నవ లక్ష్మీ బాయమ్మ | 18 |
| 5. | సర్వతోముఖ ప్రజ్ఞాశాలి యుగపురుషుడు వీరేశలింగం | 21 |
| 6. | మతాచారం పేరుతో మహిళల మారణహోమం | 25 |
| 7. | ఆటవిక దశలోకి తిరోగమనమే 'సతి' | 29 |
| 8. | మొనాష్టరీల్లో మహిళల ధ్యానం అర్థంలేని త్యాగం | 34 |
| 9. | కన్నవారే కన్నెలతో వ్యాపారంచేస్తుంటే | 38 |
| 10. | వ్యాపార ప్రకటనల్లో ఆడబొమ్మల ప్రదర్శన | 43 |
| 11. | ఆడవారి అజ్ఞానం + మగవారి ఆశాపాశం = కరప్షన్ | 48 |
| 12. | ఇదీ మన సమాజం! | 53 |
| 13. | మన హక్కులు తెలుసా? | 59 |
| 14. | నేటి సాహిత్యంలో స్త్రీ పాత్ర చిత్రణ | 64 |
| 15. | తుపాను | 70 |
| 16. | మానవవాద దార్శనికుడు: ఎం. ఎన్. రాయ్ | 77 |
| 17. | కవిరాజు సాహిత్యంలో స్త్రీ | 80 |
| 18. | కులవ్యవస్థను తొలగించడమెలా? | 91 |

# ధన్యవాదాలు

నారీ సంస్కృతి గురించి చెప్పాలంటే ఒక ఉద్గ్రంథం వ్రాయవచ్చు. ఆమె ఆజన్మాంత సమస్యలు బాధలు వివరించాలంటే ఒక 'ఎన్‌సైక్లోపీడియా' తయారు కావాల్సి వుంటుంది. అమ్మాయిగా పుట్టింది మొదలు అన్నీ సమస్యలే. అవి అంతర్వాహినిలా ప్రవహిస్తూవుంటాయి. అవి ఒక కాలానికి ఒక దేశానికి మాత్రమే పరిమితమై లేవు. అవి విడదీయరాని చిక్కుపడిన దారపు వుండలా వుంటాయి. వాటిని నిశితదృష్టితో పరిశీలించిచూస్తే తప్ప తెలియవు. పైకి మాత్రం స్త్రీ జీవితం పూతమెరుగులా, వడ్డించిన విస్తరిలా గోచరిస్తుంది. స్త్రీలను అత్యున్నత స్థాయిలోవుంచి వారిని గౌరవ ప్రదంగా చూడటం భారతజాతి సంస్కృతి అని చెప్పుకుంటున్నారు. ఆమె మాతృమూర్తి, గృహదేవత, పూజ నీయురాలు అట! వాస్తవ పరిస్థితి అలాలేదని మనకు తెలుసు.

బిడ్డల మానసికాభివృద్ధి తల్లి ఒడిలోనే ప్రారంభమవుతుంది. సాంస్కృతి కంగా వికాసం పొందని తల్లులు పెంచిన పిల్లలు విద్యా, విజ్ఞానాలకు దూరమై సమాజాభివృద్ధిని అరికడతారు. కనుక స్త్రీ విమోచన స్త్రీలకే పరిమితం కాదు. అది పురుష ప్రపంచానికి, దేశ పురోగతికి అత్యవసరం. కనుక వివేచనా శీలురైన ప్రజలు, స్త్రీ పురుషులు ముందుగా స్త్రీలలో జ్ఞానజ్యోతిని వెలిగించాలి. ఈ సత్యాలను గుర్తించిన నేను స్త్రీలోకానికి ఈ ధర్మ సూత్రాన్ని అందించ టానికే ఈ బృహత్తర కార్యభారాన్ని నెత్తినవేసుకున్నా. ఈనాటి స్త్రీల పరిస్థి తులు, వాటి స్వరూప స్వభావాలు వాటి పరిష్కార మార్గాలు సాధ్యమయినంత వరకు విశదీకరించటానికే 'మనం: మన సంస్కృతి' అనే ఈ గ్రంథాన్ని వెలుగు లోకి తేవటం జరిగింది. ఇందులో స్త్రీపుట్టుక నుండి నేటి వరకు ఆమెపైజరుగు తున్న అత్యాచారాలను, వ్యాపార ప్రకటనల్లో, కవిరాజు, బాపి రాజుల సాహి త్యంలో స్త్రీపాత్రను, మతాచారాలలాంటివి స్పృశించటం జరిగింది. అనేక సమయాల్లో అనేక పత్రికలకు వ్రాసిన వ్యాసాలు కనుక పునశ్చరణ కావచ్చు; అనేక లోపాలు, పొరపాట్లు దొర్లవచ్చు వాటిని పాఠకులు మన్నించి అసలైన భావాలే పరిగ్రహించాలి. ఈ గ్రంథంలోని వ్యాసాలు అనేకానేక పత్రి కలలో, టి వి, రేడియోల్లో సెమినార్లలో ఇంతకు క్రితమే ప్రకటిత మయినాయి. కనుక ఆయా పత్రికాధి పతులకు, డైరెక్టర్లకు ధన్యవాదలు సమర్పిస్తున్నాను. నా సహచరులు, అఖిల భారత హేతువాద సంఘాధ్యక్షులు, ఆం. ప్ర. పౌర హక్కుల ప్రజాసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. వి. రామమూర్తి సహాయ సహకారాలు విస్మరించలేను.

మల్లాది సుబ్బమ్మ
రచయిత

# నలభైఏళ్ళ స్వాతంత్ర్యానంతరం స్త్రీలస్థితి

స్వరాజ్యం వచ్చింది ప్రజలలో ఆనందోత్సాహాలు వెల్లి విరిసాయి. తమ స్థితిగతులు ఎంతో బాగుపడతాయని ఆశించారు. సత్ఫలితాల కోసం ఎదురు చూచారు. 40 సం॥ ఎన్నోరంగాలలో ఎంతో కష్టపడి ఎంతో అంత అభివృద్ధిని సాధించాం. దేశం పురోగమించింది, నదులకు ఆనకట్టలు కట్టాం. రైళ్ళ వేగం పెంచారు. విమాన సర్వీసులను అధికం చేశాం. ఎయిర్ కండిషన్ రైలు పెట్టెలను ప్రవేశపెట్టాము. భారీ పరిశ్రమలు పెరిగాయి. సిమెంటు ఉత్పత్తి పెరిగింది. ఉద్యోగాల సంఖ్య నాలుగు రెట్లయింది. ఇంత ప్రగతి వస్తే స్త్రీల స్థితిగతులు ఎలా ఉన్నాయనే ప్రశ్న ఉదయిస్తుంది. 50% గావున్న మహిళల అభివృద్ధి మీదనే దేశాభివృద్ధి ఆధార పడి వుంటుంది కనుక చర్చనీయాంశమయింది.

స్వాతంత్ర్యానంతరం స్త్రీల అభివృద్ధి విస్తరించిందని, సాంఘిక, ఆర్థిక రాజకీయ,సాంస్కృతిక రంగాలలో ముఖ్యంగా విద్యా ఉద్యోగ విషయికంగా ఆమె హోదా, స్థాయి పెరిగాయి అనే వాదన ప్రబలంగా వినబడుతోంది. ముఖ్యంగా మహిళా దశాబ్దానంతరం స్త్రీలు ఎనలేని ప్రగతిని సాధించారని వింటున్నాం. ఈనాటి స్త్రీ ఆటలలో, పాటలలో, సంగీత సాహిత్యాలలో చిత్రలేఖనంలో, సాంకేతిక రంగాలలో, వైద్యశాస్త్రంలో, టెక్నికల్ కోర్సులలో, సమానత్వాన్ని సాధించిందని భావిస్తున్నాము. ఎంట్రెన్సు పరీక్షలలో స్త్రీలే ముందడుగు వేస్తున్నారని వింటున్నాము. లాయర్లుగా, 'ఎంబాసి డర్లు'గా, మంత్రులుగా, ఎం.ఎల్. ఎ.లుగా, ఎం. పి.లుగా. ముందు ముందు కొస్తున్నారు. ఈనాటి స్త్రీ సాధించలేని కార్యరంగం లేదని, స్వేచ్ఛ సమానత్వాలు పురుషులతో సమదీటుగా అనుభవిస్తున్నదని అనుకుంటున్నాము. కుటుంబ నిర్వహణలో, ఉద్యోగ విధులలో, పోటీ పరీక్షల్లో, పరుగుపందాలలో, 'పైలట్లు'గా కూడా పనిచేస్తున్నారు. షాపింగు బ్యాంకింగు హౌస్‌కీపింగు ఒకటేమిటి సర్వరంగాలలో సమానంగా పయనిస్తున్నారు. ఈనాడు స్త్రీలు నిర్వహించలేని కార్యరంగంలేదని చెప్పవచ్చు. ఈ

అభివృద్ధి అంతాకాదన లేని నగ్నసత్యం, అయితే ఇదంతా స్త్రీల సర్వతోముఖా భివృద్ధా, నాగరికతా ప్రభావమా, విజ్ఞానశాస్త్ర పరిశోధనా ఫలితమా అనే ప్రశ్నలు మనని వెంటాడుతున్నాయి. ఒక విధంగా చూస్తే అభివృద్ధి, మరో విధంగా ఆలోచిస్తే వెనుకబడినతనం రెండూ సమాంతర రేఖల్లో గోచరిస్తు న్నాయి. లేకపోతే ఇన్నివరకట్న మరణాలు—1985లో 990 నుంచి 1986లో 1319—ఎందుకు పెరుగుతాయి అని ఆలోచించాలి. ఇంకా హత్యలు, అత్యా చారాలు, ఆత్మహత్యలు ఎందుకు జరుగుతున్నాయనే బాధతో మరికొన్ని ప్రశ్న పరంపరలు మన్ని వేధిస్తున్నాయి. కనుక ఏది సత్యం, ఏది నిత్యం అనే విషయాన్ని సునిశితంగా పరిశీలించాల్సిన పరిస్థితి ఏర్పడింది. మరో, ముఖ్య విషయం ఉంది. ఇలా అన్ని రంగా లలో అభివృద్ధి సాధించిన స్త్రీల శాతం అయిదు మాత్రమే ననేది విస్మరించ రాని విషయం. మనం ఇప్పుడు ఎలక్ట్రానిక్ యుగంలో పురోగమిస్తున్నాం. 20వ శతాబ్దం లో జీవిస్తున్నాం. ఆధునిక విధానంలో పయనిస్తున్నాం. ఈనాటి స్త్రీయొక్క ఈ అభివృద్ధి అంతా నాగరికతగా పేర్కొనవచ్చు. అంటే పూర్వం కంటే వేషభాషలలో, పనిముట్ల వాడకంలో రోజు రోజుకీ ఆధునికీకరణ పెరిగింది అన్నమాట. అంటే ఒక ప్పుడు పిడకలతో వంటచేసేవాళ్ళం ఇప్పుడు ఎలక్ట్రానిక్ పరికరాలు వాడుతు న్నాం. ఒకప్పుడు ఒంటెద్దుబండి మీద ప్రయాణాలు సాగించేవాళ్ళం ఇప్పుడు జెట్ విమానాల మీద పయనిస్తున్నాం. ఇదంతా సైన్సు పెరగటం వల్ల జరిగిన సాంకేతిక అభివృద్ధియొక్క ప్రభావము. దీన్నే నాగరికత అంటాం. ఇది చూచి మనమెంతో అభివృద్ధి చెందామనుకొనుట పిచ్చి భ్రమ. ఉII సాంస్కృతిక పరంగా మనం ఈనాడు 16 వ శతాబ్దంలోనే జీవిస్తున్నాం. అంటే మన భావా లలో ఇంకా మార్పురాలేదన్న మాట. ఈ నాడు కూడా స్త్రీని రెండవ తరగతి గానే చూస్తున్నారు. ఆమెకు పురుషునితో సమానమైన హోదాలేనేలేదు. ఆమె పుట్టుక ఒక శాపంగా భావిస్తున్నారు. ఆమెను పెంపకంలో కుమారునితో సమానంగా పెంచటంలేదు, విద్యా విషయికంగా స్త్రీ విద్య నిర్లక్ష్యం చేయ బడ్డది. ఎంతో అంత కట్నం ఇచ్చి వదిలించుకుంటే చాలుననే భావం ప్రబ లంగా ఉంది. అందువల్లే స్త్రీల అక్షరాస్యత ఈనాటికి 25% కన్నా పెరగ లేదు, కారణం ఆమెపెళ్ళి కోసమే పుట్టిందనే భావం ప్రబలంగా ఉంది. ఆమె ఆజన్మాంతం ఏదో ఒక మగ దక్షత నీడలోనే బ్రతకాలని న'స్త్రీ స్వాతంత్ర్య

మ్హర్తతి' అనేది తరతరాలుగా వస్తున్న భావం. అది మన నరనరాన జీర్ణించి పోయింది. అందుకే ఈనాడు చట్టాలలో ఉన్న హక్కులను అనుభవించలేని దుర్భర పరిస్థితులలో మనమున్నాము, బిడ్డలని కని పెంచుతూ, భర్తకు సేవలు చేస్తూ బ్రతికితే చాలదా అనేభావం స్త్రీలలోకూడా ఉంది.

కుటుంబ విషయం తీసికుంటే ఆమెకు పెళ్ళి కావటమే గగన కుసుమమై పోతోంది. కట్నం ఇవ్వలేని పిల్ల ఉద్యోగం ఉన్నాలేకున్నా విద్య ఉన్నాలే కున్నా కన్యగానే మిగిలి పోతున్నది. ఎంత అందమున్నా, ధనమున్నా, ఉద్యో గం ఉన్నా, ఆస్తి ఉన్నా, కట్నమిచ్చినా, పెళ్ళికాగానే ఆమె భర్తకు లొంగి బ్రతకవలసిందే. అతని మాటలను వ్యతిరేకిస్తే నిలువ నీడ కూడా ఉండదు. విడాకులిచ్చి బయటకి వస్తే తల్లిదండ్రులు. సమాజము గర్హిస్తుంది ఈసడిస్తుంది. భర్తలదాష్టీకం ఇంతా అంతాకాదు. కొట్టేవాళ్ళు, తిట్టేవాళ్ళు, అపవాదుల పాలు చేసేవాళ్ళు అనేకమందిని మనం చూస్తున్నాం. ఇంటింటికి ఒకకథ వింటున్నాము. బయటికి చెప్పుకుంటే తంతాడు. మనస్సులో భరించలేని ఆవేదనలతో అల్లాడి. పోతున్నారు మన స్త్రీలు. ఆఖరికి కన్న తల్లిదండ్రులు కాస్తంత చోటు కూడా ఇవ్వరు. ఆ అమాయకురాలికి చివరకు మరణమే శరణ్యం అవుతోంది. అందువల్లే వరకట్న మరణాలు నానాటికి ప్రబలిపోతున్నాయి. ఇక అత్యాచారాల విషయం ఆలోచిస్తే శారీరకంగా, మానసికంగా ఎన్నో రకాల గాతలు జరు గుతున్నాయి.

ఇక హక్కుల విషయం ఆలోచిస్తే మతధర్మశాసనాల (పర్సనల్ లా) ప్రకారం తన పిల్లకు తాను గార్డియన్ కాదు. ఆస్తి విషయంలో కూడా తేడా లున్నాయి. స్త్రీకి తానుగా దత్తత తీసికొనే అధికారం కూడా లేదు. ఆర్థిక రం గంలో సంపాదిస్తున్న స్త్రీకిగాని, స్వంత ఆస్తులున్న స్త్రీకి గాని తన ఆస్తిపై యాజమాన్యం భర్తకే ఉంటుంది. ఆర్థికంగా స్వశక్తి మీద నిలబడగలిగిన స్త్రీకి కొంత మెరుగయినా ఏ స్త్రీకి పూర్తిగా ఆర్థికాధిపత్యం లేదు అనేదానికి బోలె డన్ని తార్కాణాలున్నాయి. స్త్రీ విద్యావంతురాలైనా, ఉన్నతోద్యోగియైనా ప్రతి భావంతురాలైనా ఆమెకు ఇంటిపని, వంటపని, పిల్లల బాధ్యత తప్పటంలేదు. అవి ఆమెకు నిర్దేశింపబడిన విద్యుక్త ధర్మాలుగా పరిగణింపబడుతున్నాయి.

స్వరాజ్యం వచ్చిన తరువాత హిందువుల శాసనాలలో ఎంతో మార్పు వచ్చింది. ముస్లిం, క్రైస్తవ సమాజాలలో అసలు మార్పులేదు. హిందువులలో బహు భార్యాత్వం పోయింది. ఇది పరిగణింపదగిన పరిణామం. కాని ఇంకా ముస్లిం సమాజంలో బహు భార్యాత్వం ఉండటం శోచనీయం. స్వాతంత్ర్యం వచ్చిన నాడు వివాహ విషయికంగా స్త్రీకి రెండవస్థానం ఉండేది. అది ఈ నాటికీ ఇంకా అలాగే సాగుతున్నది అనేది పచ్చినిజం వివాహిత తనకున్న పెద్ద ఉద్యోగాన్నయినా వదులుకొని భర్తఉన్న ఊరిలో ఉద్యోగం చేయాలి. ఆమె జీవితం అతని ఇష్టాఇష్టాలపై ఆధారపడి ఆతని చుట్టూ పరిభ్రమించాలి.

రాజ్యాంగం ప్రకారం లా ప్రకారం స్త్రీ పురుషులు సమానులని 1950లో అమలులోకి పచ్చిన రాజ్యాంగం ఘంటాపధంగా చెప్పింది. కాని ఆచరణలో అది అనాడూ ఈనాడూ కూడా స్పృగ్యమయింది. కాకపోతే స్వరాజ్యానికి పూర్వం కులాంతర వివాహాలు ఇంచుమించుగా లేవని చెప్పవచ్చు. ఒకరక మైన అలాంటి వివాహాలు చెల్లేవి కావు. ఈనాడు శాసన రీత్యా వర్ణాంతర వివాహాలకు అడ్డంకులు లేవు. కాని ఆచరణలో అవి అరుదుగా జరుగుతున్నాయి. కొన్ని సమాజాలలో కుటుంబాలలో వాటికి ప్రబలమైన వ్యతిరేకత వుంది. స్వరాజ్యానికి పూర్వం కొన్ని కులాలలో కన్యలను అమ్మేవారు. ఈనాడు వర కట్నం వచ్చింది. అయితే వరకట్నాన్ని నిషేధిస్తూ 1961లో,1984లో, 1985 లో శాసనాలు వచ్చాయి. వరకట్నం తీసుకోవడం తప్పని అంగీకరిస్తున్నారు. కాని పుచ్చుకొంటున్నారు. హిందువులలో పుట్టిన ఈ దురాచారం ఈనాడు క్రైస్త వ ముస్లిం సమాజాలకు కూడా ప్రాకింది. ఇదిశోచనీయం.

స్వరాజ్యం రాకముందు హిందువులలో విడాకులు లేవు. 1948లో కొన్ని రాష్ట్రాలలో 1955లో దేశం మొత్తం మీద వచ్చిన శాసనాల ఫలితంగా హిందూ స్త్రీలకు విడాకుల హక్కు వచ్చింది. క్రైస్తవ స్త్రీకి విడాకులు రావడం చాలా కష్టం. 1869 నాటి వారి వివాహ శాసనం ఇంకా అలాగే ఉంది. ముస్లిం స్త్రీల పరిస్థితి క్షీణించింది. ఏదైనా శాసనం అవకాశం ఇచ్చినా విడాకులు తీసికున్న హిందూస్త్రీని వివాహమాడటానికి పురుషులు చొరవతో ముందుకు రావటంలేదు.

సుమారు వంద సం॥రాల నాడు కందుకూరి లాంటి సంస్కర్తలు

విధవవివాహాలు జరిపించినా, వాటికి వీలు కలిగిస్తూ 1856లో కేంద్ర శాసనం పుట్టినా ఈ నాటికి వితంతువులను వివాహమాడటానికి చాలామంది సంకోచిస్తున్నారు. చాలామంది పురుషులు కన్యలతో వివాహాలను ఆశిస్తున్నారు. 160 సం॥నాడు సహగమన వ్యతిరేక చట్టం పుట్టినా ఇంకా సతీసహగమనం జరుగుతూండటం మన వెనుక బడిన తనానికి నిదర్శనంగా భావించాలి. మరో ముఖ్య విషయాన్ని మన మిక్కడ ప్రస్తావించక తప్పదు. ఈనాడు టెస్టుట్యూబు బేబీలను సృష్టిచేస్తున్నారు కాని పిండం ఆడదని తెలిస్తే గర్భస్రావం ద్వారా హతమారుస్తున్నారు. ఆనాడు, ఈనాడు కూడా అవివాహిత స్త్రీని చిన్నచూపు చూస్తున్నారు. ఒంటరిగా స్త్రీ జీవించరాదనే భావం ప్రబలంగా ఉంది. ఆమెకు సమాజంలో భద్రత తక్కువ. "ఎవ్వరిదాన వీవు భీత హరిణేక్షణ" అని ప్రవరాఖ్యుడు లాంటి నాయకులు స్త్రీలను సంబోధించటం పరిపాటి అయింది. ఆమె ఎవరికో ఒకరికి చెందాలట. ఆమె ఒంటరిగా జీవిస్తూ తన వ్యక్తిత్వాన్ని పెంచుకుంటూ తన ప్రతిభా వ్యుత్పత్తులను వెలార్చుకుంటూ స్వావలంబనగా జీవించడాన్ని సమాజం సహించలేక పోవడం ఈనాటికి దర్శనమిస్తుంది. అందుకే 30సం॥ స్త్రీకి 13 ఏళ్ళ అబ్బాయిని తోడుగా పంపడం ఆచారమయింది. ఇలా ఎన్ని మరెన్నో వున్నాయి. ఇవన్ని స్త్రీ బానిసత్వానికి చిహ్నాలు.

ఇక రాజకీయ రంగం పరిశీలిస్తే స్త్రీల ప్రాతినిధ్యం అత్యల్పం. అయిదు శాతానికి మించటంలేదు. అసలు రాజకీయాలంటేనే స్త్రీలకు 'ఎలర్జీ'. ఓటు హక్కు కూడా భర్త ఇష్టానుసారంగా జరగాల్సిందే.

ఇంతా చెప్పుకున్న తరువాత ఒక్క విషయాన్ని గుర్తుచేయవలసి ఉంటుంది. రాజ్యాంగం ప్రకారం, లాప్రకారం స్త్రీ మానవ వ్యక్తి. ఆమెకు పురుషునితో పాటు సమానత్వం పురుషునికి ఉన్న స్వేచ్ఛ ఉన్నట్లు ప్రకటనలు చేయడం జరిగింది. అంత వరకు ముదావహం. ఆమెయెడ వివక్ష కనిపిస్తే దానిని ఖండించడం మొదలయింది. మహిళా దశాబ్దం ధర్మమా అని స్త్రీలలో చైతన్యం వెల్లువికింది. తామూ వ్యక్తిత్వంగల మనుషులమని స్త్రీలు తమ హక్కులను నిర్ధారించు కోవటానికి ప్రయత్నాలు సాగిస్తున్నారు.

ఈ 40 సంవత్సరాలలో వచ్చిన మార్పు కొన్ని రంగాలలో, కొన్ని

ప్రాంతాలలో, కొన్ని 'సెక్టారుల'లో చెప్పుకోదగిందే, కాని అదిచాలదు. అలా తృప్తిపడి ఊరుకుంటే పురోగమన ప్రయత్నం ఉండదు. స్తబ్దత ఆవరిస్తుంది; మందకొడి తనం వస్తుంది. అది ప్రమాదకరం. ఆ పరిస్థితి రాకుండా స్త్రీలు ముందడుగు వేయటం అత్యావసరం.

చివరగా ఒక్కమాట. సమాజంలో మార్పు దానంతటది రాదు. వ్యవస మారాలని చెప్తూ కాలక్షేపం చేస్తే చాలదు. మార్పుకోసం చిన్నదైనా, పెద్దదైనా- కృషి అవసరం. ప్రయత్నం కావాలంటే సంకల్పం అవశ్యంగా కావాలి. సామాజిక స్పృహ, చైతన్యం లేనిదే సంకల్పం ఉదయించదు. స్త్రీలలో మార్పుకోసం అభిలాష ఉదయించాలి. తీవ్రమైన ఆకాంక్ష పుట్టాలి. దీనికి భావ విప్లవం అవసరం. మానసిక చైతన్యం మున్ముందుగా కావాలి రావాలి. ఆ సందర్భంగా స్వరాజ్యం తర్వాత కొంతమంచి మార్పు వచ్చినా అది తగినంతగా లేనందున ఇతోధిక కృషి సాగాలి స్త్రీలు ఆ కర్తవ్య నిర్వహణకు నడుంకట్టాలి. సమాయుత్తం కావాలి.



# భారత నారి-నాడు, నేడు, రేపు

"కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, రూపేషు లక్ష్మీ, భోగ్యేషు మాతా శయనేషు రంభా, క్షమయాధరిత్రీ షట్కర్మనిష్ఠా కులధర్మ పత్నీ" (పద్మ పురాణం 47-55) ఈలక్షణాలన్నీ వున్న తరుణిని మహాపతివ్రత అని, ఆదర్శ గృహిణి అని బిరుదు లిచ్చి సత్కరించేవారు. అన్ని ఆజ్ఞలను, ఆదేశాలను పాటించడం సతికి విధ్యుక్త ధర్మమని ధర్మ శాస్త్రాల ద్వారా పురాణాలద్వారా నూరిపోసి ఆనాటి స్త్రీలకు 'బ్రెయిన్ వాష్' చేశారు. అభావాలు వారి నరనరానా జీర్ణించి పోయినందు వల్ల స్త్రీ ధర్మాలను స్త్రీలు స్త్రీలకు బోధించడం జరిగేది. ద్రౌపది సత్యభామకు, పార్వతి పరమేశ్వరునకు పాతివ్రత్య ధర్మాన్ని గురించి చెప్పడం మనం చదివాం. ఇదంతా ఆనాటి పురుషాధి పత్యానికి శాశ్వతత్వం కలుగజేయడానికి పన్నిన ఎత్తుగడ అని తెలియని మహిళలు నిజమని నమ్మారు. బానిసలు తిరుగుబాటు చేయకుండా అదిమి పెట్టడానికి బానిసలనే వాడ తారు. జైల్లో వున్న వారిని అదుపు చేయటానికి జైలుశిక్ష అనుభవించే వారినే జైలు వార్డరులుగా నియమిస్తారు కదా! ఇదే స్త్రీల పరంగా జరిగింది. తమకు సంకెళ్ళు పడ్డాయని తెలియక వాటిని బంగారు సొమ్ములుగా భ్రమసి బిగించు కున్నారు ఆనాటి స్త్రీలు.

తల్లిగా, భార్యగా, కుమార్తెగా ఆమెకు ఎన్నో ఆంక్షలు విధించారు శిక్షలు నిర్దేశించారు. నీవు ఉత్తమ గృహిణివి. మాతృదేవతవు, క్షమ, త్యాగం ఓర్పు, సహనం స్త్రీ సహజ లక్షణాలని శ్లోకాల ద్వారా కీర్తిస్తే అజ్ఞాని అయిన ఆనాటి స్త్రీ తాను త్యాగశీల కావాలని ఎన్ని కష్టాలయినా భరించేది. ఆ త్యాగ స్వరూపమే సతీసహగమనం. పాతి వ్రత్యమే పరమ ధ్యేయమని నమ్మిన సీత అగ్నిలో దూకింది. అమ్ముడు పోయింది చంద్రమతి. జూదంలో పావుగా మారింది ద్రౌపది; శిల అయింది అహల్య. భర్తను వేశ్యకు అర్పించింది సుమతి. వీరంతా మహాపతివ్రతలు. గణుతికెక్కిన ఆదర్శ స్త్రీ మూర్తులు వారి పేరు ఉచ్ఛరిస్తేనే పంచమ మహా పాతకాలు పటాపంచలై పోతాయట. అందు వల్లే భర్తలు చంపుతున్నా, నరుకుతున్నా, వాతలు పెడుతున్నా ఆ కష్టాల

ముంచు మన కష్టాలోక లెక్కా అని కళ్ళొత్తుకుంటూవుంటారు, ఇక మనువు లాంటి ధర్మశాస్త్రజ్ఞులు విషం క్రక్కుతూ స్త్రీలకు ఆ జన్మాంత సంరక్షకత్వం సృష్టించారు.

నాటి స్త్రీకి బిడ్డలను ముఖ్యంగా మగ బిడ్డను కనడమే పరమధ్యేయంగా మారింది. భర్త సేవ, కుటుంబ సంరక్షణ, పిల్లల పోషణలే ఆమె జీవిత లక్ష్యాలు. గొడ్రాలయిన స్త్రీ జీవితం కుక్క కన్నా నీచంగా చూడబడేది. వితంతువులకు కఠిన నియామాలు, ఇంటి చాకిరీ వుండేవి. అలా నాటి స్త్రీ కేవలం వంట ఇంటికి, పడకటింటికి పరిమితమై కూపస్థ మండూకంలా బ్రతికేది అదిచాలక భర్తకు ఎందరు భార్యలున్నా తొణకరాదు. పల్లెత్తు మాట అనరాదు. నవ్వుతూ, అణకువతో మెలగాలి. తను కన్న పిల్లలపై సైతం తనకు ఆధిపత్యం కాని, పెత్తం కాని, వుండరాదు. బిడ్డల్ని కనే యంత్రమే తప్ప బిడ్డకు 'గార్డియన్' కాలేదు. పిల్లలకు, భర్తకు సేవ చేయటం మిగిలింది తిని బ్రతకటం ఆమె ధర్మం. ఒక్కటేమాటలో చెప్పాలంటె భర్త కురూపి అయినా, జడుడైనా, రోగి అయినా జూదరి, త్రాగుబోతు, సప్తవ్యసనాలకు దాసుడైనా పడతికి మాత్రం ఇహం పరం ఆ పతియే కావాలి. అలా, కాని స్త్రీని వెలివేయడం, కొరడాదెబ్బలు కొట్టమని, త్యజించమని ధర్మశాస్త్రాలు వక్కాణించాయి. ఆచారాలు బలపరిచాయి. ఇలా కొన్ని వేల సంవత్సరాలు గడిచాయి.

ఈ నాటి స్త్రీకి కొన్ని హక్కులు ప్రసాదించింది భారతరాజ్యాంగం విద్యా, వుద్యోగాలలో కొంత అవకాశం లభించింది. నాల్గుగోడలు దాటి బైటి ప్రపంచాన్ని తిలకిస్తోంది. ఆటల్లో పోటీపడుతోంది. విమానాలు నడుపుతోంది, చంద్రలోకయానం చేసి వచ్చింది. జడ్జీలుగా, లాయర్లుగా ఇంజనీర్లుగా, డాక్టర్లుగా "మెరిట్" నిలుపు కుంటోంది. "యూనివర్శిటీ రేంకులన్నీ" స్త్రీల పరమవుతున్నాయి. గొప్ప గొప్ప సైంటిష్టులుగా పురోగమిస్తున్నారు. క్రీడారంగలో శక్తియుక్తులను ప్రదర్శిస్తున్నారు. అద్భుతమైన నటనా సామర్థ్యాన్ని చూపి ప్రేక్షకులను అలరింప జేస్తున్నారు. ఒకటేమిటి స్త్రీ చేయలేని పనిలేదు. పురుషుడితో పాటు పోటీగా అన్నిరంగాల్లో రాణిస్తోంది. పురుషుడి కన్నా

మిన్నగా అద్భుతమైన చాకచక్యాన్ని చూపిస్తోంది. అంటే బిడ్డల్ని కనడం స్త్రీకి మాత్రమే సాధ్యం. ఇటు పిల్లల సంరక్షణా, అటు ఇంటి బాధ్యతా, పైన ఉద్యోగ నిర్వాహణ ఇలా మూడు రంగాల్లో విధీ విరామం లేకుండా శ్రమించేది ఎవరంటే స్త్రీ అని ఒప్పుకోక తప్పదు. పురుషుడికి ఒక్క సంపాదన తప్ప బాధ్యతలే లేవు. ఆమె అలాకాదు. షాపింగు, "బ్యాంకింగు" రేషను, పిల్లలకు 'హోమ్' వర్కు, చుట్టపక్కాలకు ఆశ్రయం అలా అష్టావధానం, శతావధానంతో ఉక్కిరి బిక్కిరై సంసార సముద్రాన్ని అవలీలగా ఈదుతోంది. ఇదంతా ఈ యుగపు చరిత్ర.

అయితే ఇదంతా స్త్రీకి అభ్యుదయమా? ఆమె పురుషునితో సమానంగా హక్కులు అనుభవిస్తోందా? సమాన హోదాతో జీవిస్తోందా? స్వేచ్ఛవుందా? సమానత్వం వుందా? హెచ్చు తగ్గులు తేడాలు వున్నాయా? ఆమె ఆదాయంపై, ఆమె ఆస్తిపై ఆమెకు అధికారం వుందా? అంటే చాలమంది ఆమె హాయిగా, సుఖంగా, నీడన విశ్రమిస్తోంది, బాధలు, బాధ్యతలు లేని వారెవరంటే మన మహిళలేనని అంటూ వుంటారు. ఇదొక మహిళాభాగపతమని చెప్పుకోవచ్చు. కారణం ఈనాటి మహిళ వేషభాషలు మారాయి. ఉన్నత విద్య అభ్యసిస్తోంది. వంట పనిముట్ల రూపాలు మారాయి. బొగ్గులు, పిడకలు, కట్టెలు పోయి కరెంటు, గ్యాసు, ఎలక్ట్రానిక్కు పరికరాలు, వచ్చి సుఖపడటానికి కారణ భూతాలవుతున్నాయి. తరం మారింది. పరిస్థితుల్లో మార్పులొచ్చాయి. విలువలు మారుతున్నాయి. మార్పు అతివేగంగా పయనిస్తోంది. ఇదంతా చూస్తుంటే విలువల విప్లవమా అనిపిస్తుంది. ఇక్కడే వుందొక తిరకాసు అదే మేడిపండు చూడ మేలిమై యుండు అన్నట్లుంది నేటి స్త్రీజీవితం. పెనం నుంచి పొయ్యిలో పడట్లు వుంటుంది ఆమె జీవిత విధానం. ఇది వినటానికి హాస్యాస్పదం కావచ్చు. కాని నమ్మలేని నగ్నసత్యం ఒకటుంది.

నాగరికతగా స్త్రీ వేషభాషలు పరిసరాలు మారినా సాంస్కృతికంగా, భావాలలో మార్పులేదు. ఆనాటి బానిసత్వ పంజరం నేడు 'షోకేసు'గా మారింది. స్త్రీ పురుష తేడాలు పోలేదు. అంతస్తులు అలాగే వున్నాయి. అబలగానే చూడుబడుతోంది. ఆధారపడి జీవించే ప్రాణిగానే ఎంచబడుతోంది.

అన్నిరంగాల్లోను రెండవ 'బెంచీ'కి నెట్టబడేవుంది. రుజువు కావాలంటే బోలెడన్ని ఉదాహరణలు వున్నాయి.

అమ్మాయి పుట్టుకతోనే తేడాలు, సమస్యలు ఆరంభమవుతున్నాయి. 'జెనెటిక్సు' విభాగంవారు గర్భిణీ స్త్రీకి కొన్ని పరీక్షలు చేసి పుట్టబోయే శిశువు ఆడ, మగ నిర్ధారించగలిగారు. దాని ఫలితంగా ఆడపిల్ల పుడుతుందని తెలిసిన కొందరు గర్భస్రావాన్ని చేయించుకుంటున్నారు, అలా మొదలైన వివక్ష ఆమె జీవితాంతం వుంటూనేవున్నది. అమ్మాయికి మజ్జిగ. అబ్బాయికి పెరుగు పోసి పెంచుతారు. అలా తల్లి కూడా తేడా చూపిస్తుంది. పెద్ద విద్యలు నేర్పిస్తే పెళ్ళి కాదని కొద్ది విద్యతో మాన్పించి పెళ్ళి చేస్తారు. ఆ వివాహంలో కూడా ఆమె ఇష్టా ఇష్టాలతో నిమిత్తం వుండదు. ఇక దాంపత్య జీవితంలో అనేక కష్టనష్టాలు పాలు అవుతుంది ఆమె, విడాకులు పొందితే తప్పు, ఆస్తి అడిగితే నేరం. మళ్ళి పెళ్ళాడిన వితంతువును నీచంగా చూస్తుంది సమాజం. ఇంటి చాకిరీ ఎంత చేసినా విలువ లేక భారంగా బ్రతుకుతోంది. బ్రతకలేక ఆడది ఆత్మహత్య పాలవుతోంది. భరించలేని భర్తలు ఆశాపాతకులై అమ్మాయిల్ని హత్యచేసి చట్టం కళ్ళు కప్పి తప్పించు కుంటున్నారు. ఇది ఈనాటి కధ. అంటే మనం 20వ శతాబ్దంలో వున్నాం, కాని మన భావాలు 16వ శతాబ్దాన్ని అధిగ మించ లేక పోతున్నాయి. అందు వల్ల ఇది సంధియుగమయ్యింది. ఇటు సనాతన సంప్రదాయాలతో ఇమడ లేక పోతున్నారు. అటు ఆధునిక యుగం లోకి అడుగు పెట్ట లేక కొట్టుమిట్టాడి పోతున్నారు.

ఇక భవిష్యత్తులో స్త్రీ ప్రాత, ఆమె హోదా గురించి చర్చించేముందు కొన్ని ఆలోచనలు, ఊహలు మన ముందు నాట్యం చేస్తాయి. సామాజికంగా, వ్యక్తి పరంగా, మానసికంగా మార్పులు వస్తున్నాయి. మార్పు అనివార్యం కదా! ఈ మార్పు స్త్రీల ఉనికిలో కూడా చోటు చేసుకుంది. మహిళా దశాబ్దం వల్ల సాంస్కృతిక విప్లవం వల్లా, పాశ్చాత్య ప్రభావం వల్ల సాంఘిక పరి స్థితుల వల్లా స్త్రీలలో అలజడి సంచలనం కలిగాయి. ముఖ్యంగా దేశ పారిశ్రామికీ కరణవల్ల, ధరల పెరుగుదల వల్ల స్త్రీలు ఉద్యోగాలు చెయ్యక తప్పటంలేదు. ఈ ప్రభావాల వల్ల వారిలో కొంత ఆలోచన, స్వాభిమానం

వెల్లివిరిశాయి. ఉద్వేగం పుంతలు త్రొక్కి ంది మే మెందుకు గొప్ప చదువులు చదువుకోరాదు? ఉన్నతోద్యోగాలలో ఎందుకు చేరరాదు? మా భాగస్వాములను ఎన్నుకునే హక్కు మాకు ఎందు కుండరాదు? ఇంటి పనిలో పిల్లల పెంపకంలో మా భర్తలు మాకెందుకు సాయపడరాదు ? ఉత్పత్తి రంగలో మేమెందుకు తోడ్పడరాదు? ఆస్తి హక్కుల్ని మే మెందుకు అనుభవించరాదు? మా పని గంటలు లెక్కలేదు, పైగా మమ్మల్ని పోషిస్తున్నట్లు చీదరించు కుంటారు; మేము మంచాన పడ్డ దాకా చేస్తున్నాం. పిచ్చి ఎక్కితే తప్ప ఏనాడూ విశ్రాంతి కోరనేకోరం. మా పనికి 'రిటైర్ మెంటు' లేదు. అంటూ ప్రశ్నించు కుంటున్నారు; బాధతో అలమటించి పోతున్నారు. ఇదంత ఒక విధంగా అభి వృద్ధికి సోపానమని గర్వపడాలి.

ఇక్కడే ఒక పెద్ద వైరుధ్యం రాబోతున్నది. ఇంతవరకు అణగి వున్న ఆడది ప్రశ్నించటం, హక్కులు అడగటం మొదలైతే కుటుంబంతో అశాంతి వస్తుంది. భర్తలు అదిరి పడతారు బెదిరిపోతారు తత్ ఫలితంగా వారు పెద్దఎత్తున అణచటానికి ప్రయత్నిస్తారు. తమలో వికాసం కలిగిన స్త్రీలు అణిగి వుండలేరు. బైటికి పరిగెత్త లేరు. అప్పుడు ఇద్దరి మధ్య (కోల్డువార్) ఎడతెగని పోరాటం జరుగుతూనే వుంటుంది. హక్కులు నిలువుకోవాలని భర్తలు, సమానత్వం, స్వేచ్ఛ కావాలని భార్యల మధ్య దీర్ఘ కాలిక పోరాటం జరుగుతుంది. క్రమంగా అన్ని వర్గాల్లో, అన్ని జాతులకు ఇది ప్రాకుతుంది. ఈ పోరాటం సివిల్‌వార్ కంటే ప్రమాదంగ పరిణమిస్తుంది. ఎందరో త్యాగాలు చెయ్యాల్సి వస్తుంది. మరెందరో క్షతగాత్రులు కాకతప్పదు. కాని ఆ తరుణంలో మాత్రం మహిళలు వెనుకంజ వేయరు. 'ఫంటు'న నిలబడి విజయాన్ని సాధిస్తారు. ఇది పచ్చి నిజం. విజయ పరంపరతో వారు సాధించబోయే హక్కులు గమనార్హం.

మగ ఆడ శిశువుల పెంపకంతో తేడాలు నిర్మూలిస్తాయి. స్త్రీలలో విద్యాభివృద్ధి పెరుగుతుంది. స్త్రీలు తమ వ్యక్తిత్వ వికాసానికి ఎక్కువగా విలువ కడతారు. అన్ని వుద్యోగాలకు వారు ఎగబ్రాకుతారు. కీలకస్థానాల్లో వారికి స్థానాలు లభిస్తాయి. స్త్రీకి వివాహం విద్యుక్త ధర్మం అనే భావం బలాన్ని కోల్పోతుంది. స్త్రీ పురుషులు తమకు తాముగా ఎంచుకున్న వివాహాలు హెచ్చు

స్థాయిలో జరుగుతాయి. అందువల్ల వరకట్న వివాహాలు నశిస్తాయి, వరకట్న మరణాల సంఖ్య క్షీణిస్తుంది. సామాజిక వ్యవహారాల్లో, కుటుంబంలో స్త్రీ పురుష లిద్దరూ భాగస్వామ్యం వహిస్తారు స్త్రీకి పురుష రక్షణ కావలనే భావం సన్నగిల్లుతుంది. శాంతి వుద్యమానికి స్త్రీలు సారధులవుతారు. మగపిల్లల ప్రాముఖ్యత అంతరిస్తుంది. ఆడపిల్ల అయినా ఒక్కపిల్లతో సరిపెట్టుకునే మన స్తత్వం ప్రబలుతుంది.

స్త్రీ తన వ్యక్తిత్వ వికాసానికి ప్రాముఖ్యత ఇవ్వడంవల్ల సతీపతుల మధ్య సంఘర్షణకు అవకాశాలు పెరిగుతాయి. అందువల్ల విడాకుల రేటు పెరుగుతుంది. పునర్వివాహాలు సర్వసమ్మతమవుతాయి. పాతివ్రత్య భావనపోతుంది. సతీపతులు పరస్పర విశ్వాసంతో కాపురం చేయ మొదలు పెడతారు. ప్రేమ ?ంకు దాంపత్యం దాంపత్యంలేని ప్రేమ కరువవుతాయి. నీతి అనే పదం ఇంత వరకు స్త్రీల యెడ లైంగిక నీతిగా పరిగణింపబడుతోంది, ఇక ముందు అసలైన శసలైన శీలంపై నొక్కిపెట్టటం సంభవిస్తుంది, ఈనాటి ద్వంద్వనీతి వ్యాప్తిని కోల్పోతుంది, గొడ్రాలి యెడ నిరాదరణ, విధవలపై సానుభూతిలేమి నశిస్తాయి, పరిపాలనా రంగంలో, రాజకీయ వ్యవస్థలో స్త్రీలు ముందంజ వేస్తారు, ప్రసారసాధనాలు అందరికీ అందుబాటులో వుండటంవల్ల స్త్రీలలో సాంస్కృతిక ఉద్యమాలు వెలుస్తాయి; వ్యాప్తిచెందుతాయి. పారిశ్రామిక, సాంకేతిక, శాస్త్రీయ విషయాలలో స్త్రీ పురుషుల మధ్య సమానత్వాన్ని అంగీకరిస్తారు. ఈ ప్రయత్నంతో మూఢ విశ్వాసాలు నిర్మూలింపబడతాయి. సమాజ శ్రేయస్సుకై ఇద్దరూ కలిసిపాటుపడతారు.

రాబొయ్యే శతాబ్దంలో స్త్రీవిమోచన సందర్భంగా గొప్ప ప్రగతి వుంటుంది. ఇంతకాలం జరగని మార్పు, మౌలికమైన భావాలలో పెద్ద మార్పు, వస్తుంది. స్త్రీ తక్కువకాదు అనేభావ విప్లవం స్త్రీ పురుషులిద్దరిలో ప్రవేశిస్తుంది దానికె సాంస్కృతిక విప్లవమని పెరు పెట్టవచ్చు. దాని వల్ల సమాజ పరంగా, వ్యక్తిపరంగా సమూల మార్పు వస్తుంది, ఆనాడు, శాంతి, సత్యసంశోధన, వినమ్రత, స్వేచ్ఛాపిపాస, సహనశక్తి, ప్రజా సంక్షేమాలపై మానవదృష్టి కేంద్రీకరిస్తుంది, అప్పుడు స్త్రీ శక్తి మూడు పువ్వులుగా, ఆరుకాయలుగా పరిభ్రమిస్తుంది. మరి అరోజుకై వేచివుందామా ?

# స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీలు

మహాత్మా గాంధీ నడిపిన ఉద్యమాలలో పాల్గొన్న ఆంధ్ర స్త్రీలు గణనీయమైన సంఖ్యలో వున్నారు. కొందరు త్యాగాలకు పేరెన్నిక కంటే మరి కొందరు కార్య దీక్షకు ప్రసిద్ధి పొందారు. కొందరు అసమాన నాయకత్వ లక్షణాలను ప్రదర్శిస్తే ఇంకా కొందరు క్రమ శిక్షణకు, మేటిధైర్యానికి పతీకలుగా వెలుగొందారు.

త్యాగాలు చేసిన మహిళల్లో మాగంటి అన్నపూర్ణమ్మకు పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. విదేశంలో విద్యాభ్యాసం చేస్తున్న భర్తను చేరవలసిన అన్నపూర్ణమ్మ 1921లో గాంధీజీ బెజవాడ ఉపన్యాసాన్ని విని ఉత్తేజితురాలై తన సువర్ణాభరణాలను అన్నింటిని గాంధీజీకి సమర్పించి, పట్టు వస్త్రాలను విడనాడి ఖద్దరు వస్త్రధారణకు పూనుకున్నది. తరువాత ఏలూరు సభలో, మిగిలిన తన నగలి నన్నింటినీ గాంధీజీకి ఇచ్చివేసింది. ఖద్దరు వ్యాప్తికి ఆరేళ్ళు అవిరళ కృషి సలిపి చిన్న వయస్సులోనే మృతి చెందితే గాంధీజీ ఆమెను ప్రశంసిస్తూ తన సంతాపాన్ని తెలయుజేశాడు.

కాలగతిని అనుసరించి గాని దీక్షాదక్షతలను మదింపు చేయడంలో కాని లెక్క కడితే దువ్వూరి సుబ్బమ్మను పేర్కొనాలి. ఆంధ్రలో స్వాతంత్ర్య పోరాటంలో దూకిన ప్రథమ మహిళ దువ్వూరి సుబ్బమ్మ. అందరికన్నా ముందుగా అరెస్టయిన స్త్రీమూర్తి ఆమెయే. మహాత్మాగాంధి 1922లో సహాయ నిరాకరణో ద్యమాన్ని నిలిపివేస్తే పోరాటంలో స్తబ్ధత ఆవరించిన తరుణంలో సుబ్బమ్మ ఖద్దరు కోరకు నిరంతరప్రచారం సాగించింది. 1857 నాటి గొప్ప తిరుగుబాటు క్రూరంగా అణచి వేసిన జనరల్ నీల్ విగ్రహాన్ని మదరాసు నగరంలో నుండి తొలగి ంచాలని సత్యాగ్రహం సాగితే మొదటిజట్టు సత్యాగ్రహంలో పాల్గొన్న గౌరవం బ్రహ్మజోస్యుల లక్ష్మీనరసమ్మతో పాటు దువ్వూరి సుబ్బమ్మకు దక్కింది.

ఆమె ఉపన్యాసాలు శక్తి వంతమైనవి. ఖద్దరు ధారణ గురించి చేసిన ప్రచారంలో ఆమెకు ఆమెయే సాటి. ఆమెకు అలుపు లేదు; విశ్రాంతి లేదు.

ఆమెకు "దేశబాంధవి" అని బిరుదు ఇచ్చి ఆంధ్రప్రజలు తమ కృతజ్ఞతను తెలుపుకున్నారు. ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో ఆమె పోరాటంలో ముందు నిలిచింది. ప్రభుత్వం ఆమెను బందీగా చేసింది. "దేశ బాంధవి చిరస్మరణీయురాలు

కళావంతుల కులాన్ని సంస్కరించిన యామినీ పూర్ణతిలకం 1920 నుండి గాంధీజీ ఉద్యమంలో కృషిచేసిన మహిళ. అఖిల భారత కాంగ్రెసు కమిటి సభ్యురాలు. విదేశ వస్త్ర బహిష్కరణోద్యమంలో ఆమె విశేషంగా శ్రమించింది.

ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ శిసలైన కాంగ్రెస్ వాది. 1932లో ఆమెను ప్రభుత్వం అరెస్టు చేసింది. నిషేధించ బడిన సారాస్వతాన్ని ఆమె పంపిణి చేసింది. "వీరభారతి" అనే పేరుగల రహస్య పత్రిక వెలువడడానికి ఆమె ఎంతో దోహదం చేసింది; వార్తాహారిగా కూడ ఆమె పని చేసింది.

పాలకోడేటి శ్యామలాంబ 1921లో ఖద్దరు విక్రయ బాధ్యతను చేపట్టింది. ఉప్పుసత్యాగ్రహం రోజుల్లో ఆమెకు ఏడు మాసాల శిక్ష వేసింది ప్రభుత్వం. ఆమె కుటుంబంలో అందరు అరెష్టు అయినారు.

మాగంటి అన్నపూర్ణమ్మ తల్లి కలగా పిచ్చమ్మ విదేశ వస్త్ర దుకాణాలను కల్లుసారా సర్కారు పాటలను పికెటింగ్‌ను చేయటంలో ప్రముఖపాత్ర నిర్వహించింది. అనేక సార్లు కారాగారవాసం చేసింది.

ఆచార్య రంగా భార్య భారతీదేవి రంగా 1932లో సంత్సర జైలు శిక్షకు గురి అయింది. గాంధీ భావాల పట్ల ఉత్తేజం పొందిన ప్రముఖ మహిళా మణిఆమె.

కాంగ్రేస్ వాదుల్లో లబ్ధప్రతిష్టులు వేదాంతం కమలాదేవి. రాష్ట్రకాంగ్రెస్ కమిటి రహస్య సమావేశానికి అధ్యక్షత వహించిన నాయకులు. 19౩2లో బ్రిటిష్ ప్రభుత్వం ఆమెకు ఆరునెలలు జైలు శిక్ష విధించి సత్కరించింది.

ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి మద్రాసులో ఉప్పుసత్యాగ్రహ సందర్భంగా అరెస్టు అయిన తెలుగు స్త్రీలలో ప్రథమురాలు. తరువాత ఆమె కాంగ్రెసు మంత్రి వర్గంలో సభ్యురాలయింది.

దరిమిలా ఏలూరు పురపాలక సంఘాధ్యక్షురాలయిన మూల్పూరు చుక్కమ్మ కాంగ్రెసు వుద్యమంలో కృషిచేసి బ్రిటిషు సర్కారు వారి నిషేధాజ్ఞలకు గురి అయిన వ్యక్తి. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని జైలుకు వెళ్ళింది ఆమె.

ఆదుర్తి లక్ష్మీబాయి వ్యక్తిగత సత్యాగ్రహకాలంలో అరెస్టుకులోనై ఒక సంవత్సరం జైలుశిక్ష అనుభవించింది,

ఇవి కొందరు ప్రముఖుల పేర్లు మాత్రమే, ఇంకా ఎందరో, మరెందరో మహత్తర త్యాగాలు చేసి అష్టకష్టాలుపడి స్వాతంత్ర్యోద్యంలో పాల్గొన్న విదుషీమణులున్నారు.

జైలులో స్త్రీ సత్యాగ్రహ ఖైదీలను బ్రిటిష్ ప్రభుత్వం అనేక ఇబ్బందులకు గురిచేసింది. తల్లులను పిల్లలను వేరుచేసింది. వారిని బొట్టు పెట్టుకోనియ లేదు. గాజులను పగల కొట్టారు. ప్రసవ సమయంలో కూడా గర్భిణీ స్త్రీలను జైలునుండి వదలి పెట్టలేదు. నలుగురు స్త్రీలు జైల్లోనే ప్రసవించవలసి వచ్చింది.

స్త్రీ వాలంటీర్లను పోలీసులు దూషించారు; బూతులు తిట్టారు, అవమానించారు. రంగునీటిని, మురికి నీటిని వారిపై చల్లారు. అరెస్టు చేసి దూర ప్రాంతాలకు తీసుకెళ్ళి వదిలారు. ఇన్ని కష్టాలకు లోను అయినా మొక్కవోని ధైర్యంతో ఆంధ్ర స్త్రీలు పోరాటంలో పాల్గొని అశేష త్యాగాలు చేశారు. స్వరాజ్య సంపాదన పోరాట సందర్భంగా వారి త్యాగం వృధా కాలేదు. అజ్ఞాత స్త్రీల త్యాగాలకు జోహార్లు అర్పించటం మన విధ్యుక్త కర్తవ్యం.



# సంఘ సంస్కర్త, సంఘ సేవిక - ఉన్నవ లక్ష్మీబాయమ్మ

సుప్రసిద్ధ నవల "మాలపల్లె" రచయిత, కాంగ్రెస్ నాయకుడు ఉన్నవ లక్ష్మీనారాయణ సతీమణి లక్ష్మీబాయమ్మ. సర్వసామాన్యంగా అనేక మంది స్త్రీలు భర్తల నీడన పెరగడం కద్దు. కాని లక్ష్మీబాయమ్మ విషయం వేరు ఆమె స్వయం ప్రజ్ఞతో, స్వశక్తితో సమాజంలో స్థానం సంపాదించుకున్న మహిళారత్నం. భర్త కన్నా ఒక అడుగు ముందుకు వేసి "ఉన్నవ దంపతులు. ఆదర్శమూర్తులు" అని పేరు ప్రఖ్యాతులు సంపాదించుకో కలిగిన దిట్ట ఆమె.

బాల విధవల దుర్భర శోచనీయ స్థితికి వగచి, తపించి వారి ఉద్ధరణకు కంకణం కట్టుకున్న నారీ శిరోమణి లక్ష్మీబాయమ్మ. తెలుగునాట విధవా వివాహోద్యమానికి బాటలు తీర్చిన కందుకూరి వద్ద లక్ష్మీబాయమ్మ దంపతులు ఒక సంవత్సర కాలం రాజమండ్రిలో వుండి కందుకూరి సద్గుణాలను పుణికి పుచ్చుకున్నారు, తరువాత స్వస్థలమైన గుంటూరు చేరి విధవా వివాహ కేంద్రాన్ని 1902లో స్థాపించారు. ఆ సంత్సరమే ప్రథమ విధవా వివాహాన్ని నిర్వహించారు. అలా షుమారు నలభై సంవత్సరాలు గుంటూరు పట్టణంలో జరిగిన విధవా వివాహాలకు లక్ష్మీబాయమ్మ, ఆమెభర్త పెళ్ళిపీటల మీద పెద్దలుగా కూర్చుని నిర్వహించేవారు.

1902లోనే ఆమె హిందూ స్త్రీల కొరకు ఒక అనాధ ఆశ్రమాన్ని స్థాపించడం జరిగింది. ఆ సంస్థ తరువాత మరొక పెద్ద సంస్థలో విలీనమయ్యే వరకు విజయవంతంగా పనిచేసింది. ఆ మహోన్నత సంస్థే శారదా నికేతనం. 1922లో స్థాపించబడిన ఈ నికేతనానకి కొండా వెంకటప్పయ్య, ఉన్నవ వదంపతులు స్థాపకులయినా లక్ష్మీబాయమ్మే ఆసంస్థ బాధ్యతను నిర్వహించేది. విధవలకు ఆశ్రయమివ్వడం, బాలికలకు విద్యగరపటం ఆ సంస్థ ఆశయాలు. దానికి ఆమె మార్గదర్శకురాలు. భవన నిర్మాణ బాధ్యత ఆమె తీసుకుని

విరాళాలు సేకరించింది. కొద్ది కొద్ది మొత్తాలనుండి పెద్ద పెద్ద విరాళాల వరకు ఒంటెద్దు బండిపై ఇంటింటికీ వెళ్ళి ఆమె వసూలు చేయడం పరిపాటి.

అవి 1921 సహాయ నిరాకరణ రోజులు. "పల్నాడు తాలూకా అడవుల్లో పశువులను మేపుకోవటానికి పన్ను చెల్లించము" అని ప్రజలు ప్రతిజ్ఞచేశారు. ఈ పుల్లరి సత్యాగ్రహాన్ని లక్ష్మీబాయమ్మ భర్త నాయకత్వం వహించి నడిపారు. ప్రభుత్వం ఆయన్ను అరెస్టు చేసింది. ఖాళీ అయిన నాయకత్వ స్థానంలోకి లక్ష్మీబాయమ్మ దూకింది. అలా ఆ ఉద్యమానికి ఆమె నాయకత్వం వహించి నడిపింది.

1929లో గాంధీజీ ఆంధ్రప్రాంతంలో పర్యటించారు. దాంతో ఆంధ్ర స్త్రీలలో చైతన్యం, జాగృతి వెల్లువికింది. వారు శాసనోల్లంఘనానికి పూను కున్నారు. లక్ష్మీబాయమ్మ ఉప్పు తయారుచేసే స్త్రీల జట్టుకు నాయకత్వం వహించింది. సముద్రానికి వెళుతున్న ఆమెను పోలీసులు మార్గమధ్యంలోనే అరెస్టు చేశారు.

ఆంధ్రలో విదేశవస్త్ర బహిష్కరణోద్యమం ముమ్మరంగా సాగింది. ఆ ప్రయత్నానికి సమర్థవంతమైన నాయకత్వాన్ని అందించిన ఘనత లక్ష్మీ బాయమ్మది. గాంధీజీ 1940లో ప్రారంభించిన వ్యక్తి సత్యాగ్రహంలో గాంధీజీ ఆమెను ఎంపిక చేశారు. తదుపరి ఆమె మళ్ళీ అరెస్టయి కారాగార వాసం చేసింది.

'శ్రీ శారదానికేతనం' అనే మాస పత్రికను ప్రచురించి సంస్కరణ భావ ప్రచారానికి ఆమె ఎంతో తోడ్పడింది.

లక్ష్మీబాయమ్మది అసామాన్యమైన వ్యక్తిత్వం. ఆమెమూర్తిత్వ విశిష్టం. దీర్ఘకాయురాలు. నిండు విగ్రహం. వెడల్పయిన ముఖం. విశాల ఫాలభాగం. నుదుటిపై పెద్దబొట్టు. ఆమెను చూసిన వారు ఆమెను విస్మరించలేరు ఎవ్వరూ నాయకత్వ లక్షణాలు ఆమెలో పుట్టి పడేవి ఆమె ముఖం గాంభీర్యం స్త్రీ పురుషు లను అప్రతిభులను చేసేది.సమాజ వ్యతిరేక శక్తులకు ఆమె సింహ స్వప్నంగా

వుండేది. ఆమె మహా నిరాడంబర జీవి. తెల్లని శుద్ధ ఖద్దరు వస్త్రాలే ఆమెకు సౌమ్ములు. నిస్వార్ధసేవే ఆమె స్వరూపం. అనాధ బాలికలే ఆమె అనుంగు పుత్రికలు. సంఘసేవే ఆమె ఊపిరి. సంస్కరణాభిలాషే ఆమె ధనం. శారదా నికేతనమే ఆమె ప్రాణం.ఆ సంస్థపై ఆమెకు ఎనలేని అభిమానం. నికేతనంలోని విద్యార్థినుల శీల సంరక్షణ ఆమె బాధ్యత. అందుకే అక్కడే ఆమె నివాస ముండేది. నికేతనంపై తప్ప మరి దేనిపైనా ఆమెకు మమకారం లేదు. దాని కోసమే అహరహం శ్రమించింది. దాని సేవలోనే ఆమె అసువులు బాసింది. ఇటు సంఘసేవ, అటు దేశసేవ, మధ్యలో సంస్కరణ కార్యక్రమాలతో జీవితాన్ని సార్ధకంచేసుకున్న ధన్యజీవి లక్ష్మీబాయమ్మ.



# సర్వతోముఖ ప్రజ్ఞాశాలి యుగపురుషుడు వీరేశలింగం

కందుకూరి వారి జన్మదినోత్సవాలను ఎందుకు జరుపుకుంటున్నాం? మహిళలేకాక మగవారుసైతం ఆయనకు ఎందుకు నివాళులర్పిస్తున్నారు? వారిని 'గద్యతిక్కన' అని అరుద్ర శ్లాఘిస్తే "దక్షిణాది ఈశ్వరచంద్ర విద్యాసాగర్" అని సంస్కరణాభిలాషులు అభివర్ణించడానికి కారణమేమిటి? అని ఆలోచిస్తే సంస్కర్తగాను, పత్రికానిర్వాహకులుగాను, సాహితీవేత్తగాను, దాతగాను ముఖ్యంగా స్త్రీ జనోద్ధారకులుగా వారికి వారేసాటి. స్త్రీ స్వాతంత్ర్యం కావాలని ఆయనకు ముందే పుస్తకం వ్రాసిన వారున్నారు. స్త్రీ విద్యకోసం పాఠశాలలు స్థాపించిన వారున్నారు. విధవా వివాహాలు శాస్త్ర సమ్మతమని (పరాశరస్మృతి) పుస్తకాలు వ్రాసిన వారూవున్నారు. కాని ఈ మూటినీ కలిపి వాటి వ్యాప్తి చెయ్యటం తన విద్యుక్త ధర్మమని భావించి ఆ కృషిని ఒక మహోద్యమంగా సాగించిన ఘనత ఆయనది. పై మూడింటికి ఆయన ఆద్యుడు కాదని నిరూపించే చారిత్రిక పరిశోధనవల్ల ఆయన గొప్పతనం తగ్గిపోదు. ఆయనకు పూర్వం సంస్కరణ భావాలు వున్నా సంస్కరణోద్యమానికి, సిద్ధాంత పటిమను నిర్మాణాత్మకమైన ప్రద్యక్షు రూపాన్ని ఇచ్చిన ఘనత ఆయనది అని చెప్పక తప్పదు. వారిలో సంస్కరణ బీజాలు ఎలా వచ్చాయి? అంటే ఆ రోజుల్లోనే వారి కుటుంబంలో స్మార్తస్త్రీని కోడలిగా స్వీకరించడంవల్ల సంస్కరణ భావాలు అంతకుముందే వున్నాయని తన ఆత్మకథలో వ్రాశారు. ఆయన ఇంగ్లీషు చదవడం వల్ల పాశ్చాత్య భావాలు ఆయనలో చోటు చేసుకోవటానికి అవకాశం కలిగింది. అంతేకాక ఆయనలో స్వభావరీత్యా ప్రశ్నించే ధోరణివుంది. అందుచేత సనాతన హిందూ ఆచారాలను పరిశీలన చేయడం, అవి అతని న్యాయ దృష్టికి తర్క బుద్ధికి నిలవకపోవడం జరిగింది.

కందుకూరి వారి ప్రతిభ అనేక రంగాలలో వికాసం పొందింది. తెలుగు సాహిత్యంలో వివిధ రీతులను ఆయన చేపట్టాడు. నవల, నాటకం, ప్రహసనం

గద్య పద్యాలు, కవి పుంగవుల చరిత్రలు, ఆయన సాహితీ రీతులకు నిదర్శనాలు. మరో మాటలో చెప్పాలంటే ఆధునిక తెలుగు సారస్వతానికి దోవ చూపిన ఆదిపురుషుడు. తెలుగు సాంఘిక వ్యంగ్య రచన, విజ్ఞానశాస్త్రం, శాస్త్రీయ, జీవితకథ, స్వీయచరిత్రల సృష్టికర్తగా పేర్కొనవచ్చు. కనుకనే వారిని "నవ్యాంధ్ర జాతిపిత" అన్నారు.

కుల తత్వాన్ని నిరసించాడు. రాజకీయాల్లో ఆయన మితవాదులలో మితవాది. మొదట్లో రాజకీయ సంస్కరణకన్నా సంఘ సంస్కరణ ముందుగా జరగాలని వాదించాడు. కాని 1910 నాటికి రెండూ ఏక కాలంలోనే జరగాలని అన్నాడు. 1874లో ఆయన సంఘ సంస్కరణకు పూనుకునే నాటికి ఆయన వయస్సు 26 ఏళ్ళు. ఆయన సంకల్పబలం మహా దొడ్డది. కార్యదీక్ష అనల్పం.

మూఢవిశ్వాసాలను అర్ధం లేని ఆచారాలను విమర్శించడమే కాదు వాటిని ఖండించేవాడు. భూతవైద్యులను, మాంత్రికులను ఒక్క దయ్యాన్నయినా చూపమని పట్టుపట్టి వాళ్ళతో వెళ్ళి స్మశానాలలో కూర్చునేవాడు. బ్రహ్మసమాజ సారస్వత పఠనం, పాశ్చాత్య సంస్కృతీ పరిచయం ఆయన మీద ప్రభావం చూపాయి. ప్రభుత్వోద్యోగుల లంచగొండి తనానికి వ్యతిరేకంగా పోరాడాడు.

సంస్కరణలలో ముఖ్యమైనది, శాశ్వత చరిత్రగలది స్త్రీ జనోద్ధరణ. ఆయన కార్యాచరణకు ఒక తాత్విక ప్రాతిపదిక వుంది. దానికి ఒకకార్యక్రమం కూడా వుంది. తను విశ్వసించిన దానిలో నమ్మకం వున్నవ్యక్తి. ఆయన వ్యక్తిత్వమూ, సంకల్పబలమూ కల మహా మనీషి కనుక ఆనాడు అతి నిషేధమైన వితంతు వివాహాన్ని, స్త్రీ విద్యను, కన్యా శుల్కాన్ని వ్యతిరేకించాడు. శాస్త్రాల ఆధారాలతో బాల్య వివాహాలను తిరస్కరించాడు. స్త్రీ విద్యను బలపరిచాడు. 'స్త్రీలు విద్యకు తగరు' అని వ్యతిరేకులు అన్నప్పుడు "పురుషులు విద్యకు తగరు" అని ఎగతాళి చేస్తూ వ్రాశాడు. 1874లో ధవళేశ్వరం లోను 1831 లో రాజమండ్రిలోను బాలికా పాఠశాల స్థాపించాడు. ముందుగా తన భార్యకు విద్యనేర్పి ఆమెనొక ఉపాధ్యాయినిగా తయారు చేశాడు.

కన్యాశుల్క విధానాన్ని ఘాటుగా విమర్శిస్తూ దానిని నరమాంస విక్రయంగా అభివర్ణించాడు. వంశాంకురం కోసం వృద్ధులైన పురుషులు బాలికలను వివాహమాడేవారు. ఇంకా, బీదరికం వల్ల అడపిల్లను అమ్ముకునేవారు. ఏడాది పిల్లకు రు. 350 ధర పలికేది. శాస్త్రాల ఆధారంతో ఆయన బాల్యవివాహాలను నిరసించాడు. నిషేధ శాసనం కావాలని సంఘంద్వారా ఆందోళన జరిపించాడు.

వితంతు వివాహాలకై అహరహం శ్రమించాడు. 1881లో మదరాసు రాష్ట్రంలో 21 శాతం విధవలు వుంటే అందులో 2 శాతం మాత్రమే రజస్వల అయిన తరువాత వితంతువులైన వారున్నారు. వారి పరిస్థితిని గురించి రాజశేఖర చరిత్రలో వివరించాడు. స్థిరసంకల్పులైన అయిదుగురు సహచరులతో వితంతు వివాహ సంఘస్థాపన 1879లో రాజమండ్రిలో స్థాపించాడు. ఈ సంఘం ద్వారా వితంతు వివాహ శాసనంలోని లోపాలను ఎత్తి చూపాడు. 1881లో ప్రథమ విధవావివాహం జరిపించాడు. దానికి బ్రహ్మాండమైన వ్యతిరేకత వచ్చింది. పురోహితులను, వంటవాళ్ళను, మేళగాళ్ళను రాకుండా సనాతనులు అడ్డుతగిలారు. వధువును ఎత్తుకెళ్ళటానికి ప్రయత్నం జరిగింది. 500 మంది విద్యార్థులు, పోలీసులు ఆయన ఇంటికి కాపలా కాశారు. వెంటనే ఆ దంపతులను సంఘబహిష్కరణ చేశారు. మదరాసులో కులాతీత విందుకు ఆయన వచ్చాడ నేద్వేషంతో 5గురు మాత్రమే హాజరయిరారు. ఆ తరువాత రాజమండ్రిలో, మదరాసులో వితంతు వివాహ వ్యతిరేక సంఘాలు వెలిశాయి. ఇంత అంజడి జరిగినా ఆయన చలించలేదు; వెనుకడుగు వేయలేదు. కారణం తను విశ్వసించిన దానిలో నమ్మకం ఉన్న వ్యక్తి. నిష్కళంకమైన శీలం, సాహసం, వినయం వున్న మనిషి. కాని అదే సమయంలో స్థిరచిత్తం కలిగిన వ్యక్తి. అలాంటి వ్యక్తిత్వం, సంకల్పబలంకల మనుషులు బహు అరుదు కనుకనే ఆయన్ని యుగ పురుషుడని వర్ణించాం. ఎన్ని పెళ్ళిళ్ళు చేశాడనేది ప్రశ్నకాదు. నాంది పలికాడు. శక్తి, సామర్ధ్యం, ఉన్ననాళ్ళు విధవా వివాహాలు చేస్తూనేవున్నాడు. అంతేకాదు ఆయన స్థాపించిన ప్రార్థనా సమాజం, సంఘ సంస్కరణ సంఘం, వివేక వర్ధని పత్రిక ఈ మూడూ పనిచేస్తూనే వున్నాయి.

రాజ్యలక్ష్మమ్మగారి త్యాగం గొప్పదా, వీరేశలింగం గారి కార్యదక్షత గొప్పదా అని ప్రశ్నిస్తే అదొక చిక్కు ప్రశ్నగా తయారవుతుంది. ఆమె పెళ్ళినాటికి ఆమెవయస్సు 10సం॥. ఆయనకు 13సం॥. భర్తవద్ద విద్య నేర్చుకొని ఉద్యమంలోకి వచ్చింది. వితంతు శరణాలయంలో ఉపాధ్యాయినిగా పని చేసింది. తనను వెలివేస్తే చలించలేదు. పుట్టింటివారు గడప త్రొక్క నివ్వక పోతే బాధపడి ఎరుగదు. పని మనుషులు "బాయికాట్' చేస్తే గోదావరి నుండి నీళ్ళు తెచ్చి వంటలు చేసేది. తన ఆశ్రయాన్ని కోరిన వితంతువులకు పెళ్ళిళ్ళు చేసి వారికి పురుళ్ళు పోసి, వారి యోగక్షేమాలు చూచేది. తల్లిలా వారిని శ్రద్ధతో, జాగ్రత్తగా కాపాడేది. అలాంటి వదాన్యులు మళ్ళీపుట్టారా అని పిస్తుంది. కారణం, భర్త తనకున్న 41 వేల రూపాయల ఆస్తిని హితకారిణి సమాజానికి దానం చేస్తుంటే నిండు మనస్సుతో సహకరించిన మహా విదుషీమణి ఆమె. సహజంగా స్త్రీకుండే సంపదపై వ్యామోహం ఆమెకు లేదు. కనుకనే ఆమెను 'చిరస్మరణీయురాలు' అని గౌరవించారు. తను తన ద్వారా భర్తకు ధన్యత గడించిన మహోన్నత వ్యక్తి ఆమె.

కందుకూరి వారిని సర్వతోముఖ సంస్కర్తలు అని అనడం సమంజసం. బీదకుటుంబంలో పుట్టి బడి పంతులుగా బ్రతికి అనారోగ్యంతో అలమటిస్తూ ఎక్కడ అన్యాయం జరిగినా నేనున్నానంటు వచ్చి సెలవు పెట్టి వారికి సాయం చేసేవాడు. మళ్ళీ ఏస్వార్థం ఆశించి ఎరుగడు. ఎందరు తిట్టిపోసినా అందరికి వెలుగునిచ్చే మైనపు వృత్తి లాంటి జ్యోతి ఆయన. ఈనాడు మనకు ఎన్నో వన రులున్నా ఏఒక్క పనీ చెయ్యలేము, ఏ త్యాగమూ చెయ్యలేము. ఏ పట్టుదల, స్థిర చిత్తం లేనివాళ్ళం, ఇప్పటికైనా ఆ మహనీయుని అడుగుజాడల్లో పయనిద్దామా!



# మతాచారం పేరుతో మహిళల మారణహోమం



మధ్యయుగపు సంస్కృతికి అంతంలేదా? మళ్ళీ మనం అంధకారయుగం లోకి పోతున్నామా? అసలు పతి లేని సతి చచ్చిపోవాలా? ఆమె బ్రతికితే అరిష్టమా? అంతేకాదు ఈ 20వ శతాబ్దంలో తే 29-9-87దిన జరిగిన అసెంబ్లీ చర్చలో కూడా పలువులు రాజకీయ వేత్తలు సతిని నిషేధించే శాసనాన్ని వ్యతిరేకిస్తూ దాన్ని కట్టుదిట్టం చేయరాదంటూ వాదించటం వింటుంటే మన అనాగరిక లక్షణాలకు మనమే సిగ్గుపడాల్సి వస్తుంది. సభ్య ప్రపంచంలో తల వంచాల్సి వస్తుంది.



ఇటీవల రాజస్తాన్‌లో జైపూర్‌కు 80కిలో మీటర్ల దూరంలో దేవరాలలో రూప్‌కున్‌వార్ అనే 18 ఏళ్ళ యువతిచేత సహగమనం చేయించారు. సనాతన వాదులు (అది పార్లమెంటు స్పీకర్ బల్‌రామ్ జక్కర్ నియోజకవర్గం లోని గ్రామం అక్కడ అక్షరాస్యత చాలా తక్కువగా వుంది. జనాభాలో హెచ్చుమంది రాజపుత్రులు. ఆగ్రామంలో 4-9-87న సమర్‌సింగ్ అనే ఒక యువకుడు మరణించాడు. అతని శవాన్ని ఉదయం 10గం॥లకు ఇంటికి తెచ్చారు. ఆరోజు మధ్యాహ్నం గం 2-30 ని॥లకు దహనం జరిగింది. శవం రాగానే భర్త బంధువులు ఆచావు ఆ పిల్ల రాక వల్లనే జరిగిందని తిట్టిపోశారు ఇంటి పెద్దల కుట్రతో, మత వాదుల దాష్టికంతో, బంధుమిత్రుల సహకారంతో సతీ సహగమనపు ఏర్పాట్లు చేయబడ్డాయి. రూప్‌కున్‌వార్‌ను భర్త శవం ప్రక్కన చితిపై కూర్చోబెట్టారు. పెద్ద పెద్ద కర్రలతో దుంగలతో చితిని కప్పారు. బట్ట ముక్కలు, గడ్డి వాడారు. డబ్బాలతో నెయ్యి కుమ్మరించారు. 15 ఏళ్ళ మరిది చితికి నిప్పు ముట్టించాడు. "సతీ మాతకుజై" అని జనం కోలాహలంగా అరిచారు. భజనలు చేశారు. బాధ భరించ లేక ఆమె మూడు సార్లు చితిలోంచి లేచి పారిపోవాలని ప్రయత్నించింది. చుట్టూ వున్న మగవారు ఆమెను మళ్ళీ మంటల్లోకి నెట్టారు. చూస్తూండగానే ఆమె భస్మీపటలమయి పోయింది.

తరువాత పోలీసులు రంగప్రవేశం చేశారు. ఆమె మరిదిని, మామను, పురోహితుణ్ణి, మంగలిని అరెస్టు చేశారు. సంప్రదాయానికి బద్ధులైన రాజ పుత్రులు ఆమెను దేవతగా భావించారు. ఆమె చనిపోయిన 13వ రోజున 4 లక్షల మంది జనం (పోలీసుల లెక్క ప్రకారం రెండున్నర లక్షల మంది ప్రజలు) ఉత్సవంగా ఆవూరు తిరునాళ్ళకు వెళ్ళినట్లు వెళ్ళారు. అదొక మహోత్సవంగా చేశారు. ఆ వుత్సవం పేరు చునార్. ఆ చుస్రీ మహోత్సవం బస్సులను ప్రభుత్వం ఆపింది. కాని ప్రజలు కాలి నడకన, బళ్ళ పైనా చేరారు. వేలకొద్దీ రాజపుత్ర యువకులు పొడుగాటి కత్తులు చేతబూని పహరా ఇచ్చారు. ఆ రోజున పోలీసులు జోక్యం చేసుకున్నట్లయితే రక్తం వరదలయి పారేది. ఆ "సతీ" భస్మమైన బూడిదను ముఖానికి బొట్టు పెట్టుకుంటే పుణ్యలోకాలకు పోతారని, ఆ స్త్రీలకు వైధవ్యం రాదనీ, ఆ నాటి మతాచారం. ఆ సంప్ర దాయాన్ని పునరుద్ధరించాలనేదే వారిధ్యేయం. అందువల్లే ఆ ఇల్లాలు దహన మయిన బూడిద ముఖంపై పూసుకున్నారు. ఆ ప్రదేశం చుట్టూ గోడ కట్టారు. అక్కడొక ఆలయ నిర్మాణం చేద్దామని ప్రజా సంకల్పం. అందుకు సన్నాహాలు చురుకుగా సాగుతున్నాయికూడా!

కొద్ది సంఖ్యలో మహిళా సంఘాలు, జైపూర్‌లోని పౌర హక్కుల ప్రజాసంఘం తప్ప అక్కడ నిరసించిన వారు లేనేలేరు. కొన్ని హిందీ పత్రికలు ఈ ఆచారం యొక్క పవిత్రతను సమర్థిస్తూ సంపాదకీయాలు వ్రాశాయి. ప్రతిపక్ష రాజకీయ పార్టీల రాష్ట్రనాయకులు దేవాలయ నిర్మాణాన్ని ఆపరాదని ప్రకటనలు చేస్తున్నారు. పైగా సతిని సమర్థించమని చెపుతున్నారు. కాంగ్రెసు నాయకుడు ఉత్సవంలో పాల్గొన్నట్లు ఆరోపణలు చేయబడ్డాయి. అతడు కాదంటున్నాడు. పార్లమెంటు స్పీకరు 'సతిని' ఖండించటంతో ప్రధాని (20 రోజుల తర్వాత నైనా ముఖ్యమంత్రికి లేఖ వ్రాయటంతో) రాష్ట్రప్రభుత్వం కదిలింది. ఇంకా మరి కొందరిని అరెస్టు చేయించింది. వెంటనే 1954 నాటి రాజస్తాన్ మత భవనాల నిర్మాణ శాసనాన్ని మార్చటానికి సంకల్పించింది. కథ అడ్డం తిరిగింది. పోలీసులకు సాక్ష్యం చెప్పేవారు కరువవుతున్నారట. చితి మండుతున్నప్పుడు తాము వెనుదిరిగి వున్నామని, ఆమె మంటలో దూకిందని కథను నిందితుల బంధువులు ప్రచారంలోకి తెచ్చారు.

ఈ జిల్లాలో సతీమాతల దేవాలయాలు, ఛత్రాలు చాలా వున్నాయి. ప్రజల్లో విద్యవున్నా సంప్రధాయాన్ని వారు విడనాడ లేరు. ఇదీ కథ. 160 సం॥ల నాడు 1829లో విలియం బెంటింక్ సతీ సహగమన నిషేధ శాసనం చేయిస్తే ఇంకా ఈ ఆచారం సాగటం సిగ్గుచేటని ఆధునికులు భావిస్తున్నారు. మహా గొప్ప సంస్కర్త రాజా రాంమోహనరాయ్ సహగమన నిషేధానికై యావ జ్జీవం పోరాడి అనేక కష్టాల కోర్చి సతీ నిషేధ శాసనానికి బాధ్యుడయ్యాడు. ఆయన త్యాగాన్ని వమ్ము చేశారు. ఈ సమస్యను సరిగా అవగాహన చేసుకో వాలంటే మూలానికి పోయి విచారించాలి. ఎందు కొచ్చిందీ ఆగారం? ఎందుకు ప్రబల మయింది? గర్భవతిగా వున్నభార్య, పిల్లలున్న భార్య సహగమనం చేయటానికి వీలులేదు. సనాతన హిందూ కుటుంబాలలో వితంతువుల బాధలు చెప్పనలవి కాదు. తిండికీ బట్టకు, అందానికి అలంకారానికి దూరమై కృంగి కృశించి అత్తమామల ఇంట వూడిగంచేస్తూ ఈసడింపులకు అవమానాలకు లోనవుతూ తన శీలానికి ఎక్కడ ముప్పు వస్తుందో నని తహతహ లాడుతూ ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని జీవయాత్ర సాగించాల్సి వస్తుంది. అందువల్ల వితంతు స్త్రీ అత్తమామల ప్రోద్బలానికి లోనయి, వైధవ్య జీవితం కన్న చావే మేలని ఆమె భావించడంతో ఆశ్చర్యం లేదు. ఆమె బ్రతికి వుంటే దత్తుచేసు కుంటే తమ ఆస్తి తగ్గిపోతుందని ఆమె బావలూ. మరుదులూ భావించడంలో అంతకన్నా ఆశ్చర్యం లేదు. దానికి తోడు భార్య పతివ్రతగా వుండాలని ఆమెకు నాథునితోనే జీవితమని ప్రచారం చేసే మత ప్రచారకులు కోకొల్లలు. వీటికి తోడు ముసల్మాన్ యుగంలో ఉత్తర భారతంలో యవ్వనంలో వున్న స్త్రీల శీలానికి రక్షణ పోయింది. ఇలా ఒకటి కాదు, రెండుకాదు. అనేక కారణాలు కలిసి ఆ భర్తను కోల్పోయిన పడుచు పిల్లను మంటల్లోకి నెట్టింది నాటి సమాజం, సహగమనం చేయనని ఆమె ఎదురు తిరిగి పెడ బొబ్బలు పెడుతూ ఏడుస్తూంటే ఆ దుఃఖ ధ్వనులు వినపడ కుండా మేళతాళాలు వాయించేవారు. చితినుండి దుమికి ఆమె పారిపోదలిస్తే పొడుగాటి గడలు చేతపూని ఆమెను బలవంతంగా మంటల్లోకి నెట్టేవాళ్ళు చుట్టూవున్న మగవారు. ఇదంతా పుణ్య కార్యమట. అలా స్త్రీలను నమ్మించిన మతవాదులు తమ ఆధి పత్యాన్ని నాడేకాదు. నేడు కూడ అనుసరిస్తున్నారు.

ఒకనాడు మధ్యధరా సముద్ర ప్రాంతంలో రాజుల భార్యలను రాజుల శవాలతో పాటు పూడ్చి పెట్టేవాళ్ళు. మరి స్వర్గలోకంలో వారికి భార్యలు కావాలి కదా! అలాంటిదే ఈ సతీసహగమన ఆచారం. అంటే స్త్రీ మనిషి కాదు. స్త్రీకి వ్యక్తిత్వం లేదు. ఆమె భర్తకోసం జీవించాల్సిందే కాని తనుగా జీవించటానికి వీలులేదు. ఈ పురుష దురహంకార మనస్తత్వం అలాంటి అహంకార ప్రదర్శనకు దారితీయటంలో అబ్బుర మేమున్నది? స్త్రీ పురుషుని ఆస్తి. పురుషుడు చనిపోతే ఆమె చావాల్సిందే. ఇదీ ఈ ఆచారం వెనుకనున్న తత్వం; తర్కం కూడాను, ఈనాడు ఈ ఆలోచనను ఆధునిక స్త్రీలు అంగీకరించరు. వారు తమ అస్థిత్వాన్ని తమ వ్యక్తిత్వాన్ని సంరక్షించు కోవటానికి సన్నద్ధులవు తున్నారు. ఓట్ల కోసం తాపత్రయ పడే రాజకీయవాదులు, పురుషప్రాధాన్యతను నొక్కి చెప్పే మతాను యాయులు ఎవరు ఏమన్నా స్త్రీలు ఈ అన్యాయాన్ని సహించరు; సహించ కూడదు, ఈ సమాజంలో స్త్రీలు అనుభవిస్తున్న కష్టనష్టాలకు బాధామయ జీవితానికీ ఈ ఆచారం ఒక ప్రక మాత్రమే. ఇలాంటివెన్నో వున్నాయి. ఉదాహరణకు వరకట్న పిశాచం, వరకట్న హత్యలు లాంటివి ఎన్నో స్త్రీలను బాధిస్తున్నాయి. ఈ ఆచారం వెనుకనున్న మౌలికమైన కుట్రను, అమాయకంగా నమ్మేవారి అజ్ఞానాన్ని పటాపంచలు చేసిన నాడే స్త్రీ జాతికి విముక్తి లభిస్తుంది. దానికై స్త్రీలంతా ఐక్యతగా నిలబడాలి.



# ఆటవిక దశలోకి తిరోగమనమే 'సతి'

రాజస్థాన్‌లో జరిగిన 'సతి' ఒక్క మారుమూల గ్రామానికే కాదు భారత దేశానికి, హిందూ మతానికే కాదు యావత్ స్త్రీ జాతికే గొడ్డలిపెట్టు. మళ్ళీ మనం మధ్యయుగాల సహగమనాన్ని హర్షిస్తున్నమాట. ఏ స్త్రీ తనకు తానుగా మరణ హోమానికి సిద్ధపడదు. మరి కారకులెవ్వరు? అంటే మూఢ సంస్కృతి, పురుషదురహంకారం, కుటుంబ సాంప్రదాయాలు అని పేర్కొన వచ్చు. ముఖ్యంగా స్త్రీల అజ్ఞానం, వెనుకబడినతనం. వీటి ఆసరాలేకాక రాజకీయ నిరాదరణ కూడాను. 1829లో సహగమన నిరోధ శాసనాన్ని లార్డు బెంటిక్ ద్వారా రాజా రామ్ మోహనరాయ్ సాధిస్తే ఆ చట్టాన్ని మన వారు ఈనాడు కూడా వమ్ము చేస్తున్నారంటే న్యాయవ్యవస్థను సామాజిక వ్యవస్థ ధిక్కరించిందన్నమాట. మన చట్టాలకన్నా మన సంప్రదాయాలకే విలువా, గౌరవం వున్నాయని నిరూపిస్తున్నాయి ఈ దుష్ట చర్యలు. ఒక స్త్రీని పట్ట పగలే దారుణంగా సజీవ దహనంచేయటమే కాక అదొక మహా పుణ్యకార్యమని లక్షలాది ప్రజలు అదొక మహోత్సవంగా చిత్రించటం మహాదారుణమంటే తప్పులేదు. వారికి ఏ శిక్ష విధించినా తీరదు. ఆ ఘోరం అంటే ఆ సహగమనం అసలు ఆత్మార్పణ కానేకాదు. పట్టపగలు నడిరోడ్డున వేలమంది కలిసి చేసిన హత్య. ఈ దారుణ కాండకు బాధ్యతవ్వ ఎవరిదని ఆలోచిస్తే చట్టాలు అమలు పర్చని అసమర్థ ప్రభుత్వానిది; సంస్కారంలేని ప్రజలది, సంప్రదాయాలను గౌరవించే కుటుంబీకులది,. అన్నెం పున్నెం ఎరుగని అమాయకులైన ఆడ వారిది. ఇలాంటి దురాచారాలను పోషించేది పెంచేది ముఖ్యంగా పురుషులే. వితంతువులను నీచంగా చూసే లక్షణం మన సమాజానికి పట్టిన గ్రహణం. బాల్య వివాహాలు, వరకట్న దౌర్జన్యాలు, భార్యలపై హింసల లాంటి పాతక చర్యలను సంస్కరించాలంటే బాధితులైన స్త్రీలే ముందుకు రావాలి. సతిని పూజనీయంగా భావించే పరిస్థితివుంటే అసలు స్త్రీకి పెళ్ళే అనవసరమని రుజువు చెయ్యాలి. వివాహ వ్యవస్థే మారాలి. ఏ అన్యాయం ఏ మూల ఏ స్త్రీకి జరిగినా అది మనందరికీ జరిగినట్లు స్పందించాలి. ఇది మన స్త్రీల ప్రథమ కర్తవ్యం.

సతి సందర్భంగా వచ్చిన ప్రజా వ్యతిరేకత వల్ల రాజస్తాన్ ప్రభుత్వం అక్టోబరు 1వ తేదీన సతి సహగమన నేరాన్ని గురించి ఆర్డినెన్సును జారీ చేసింది. ఈ రాజస్తాన్ సతి (నిరోధ) ఆర్డినెన్సుకు భారత అధ్యక్షుని అనుమతి లభించింది. ఇలాంటి శాసనం స్వాతంత్ర్యానంతరం భారత దేశంలో రావడం ఇదే మొదటి సారి.

రాజస్తాన్‌లో ఈ దురాచారం ప్రబలంగా ఉంది. గత నలుబది సంవత్స. రాలలో 28 మంది స్త్రీలు సతీ సహగమనం చేశారు లేక ఇతరులు చేయించారు. అందులో 18 మంది రాజపుత్ర స్త్రీలు. పదిమంది తలిమ్మా కులాలవారు. 1981 నుండి పోలీసులు వ్యతిరేకిస్తున్నా సతికి ఉద్యమించిన కేసు రూప్ కన్వర్‌ది, అంతకుముందు ముగ్గురు స్త్రీల ప్రయత్నాలను పోలీసులు ఆపారు.

ఈ దురాచారానికి ప్రజల మద్దతు ఉంది. హిందువులు సతిని పవిత్ర ఆచారంగా భావిస్తున్నారు. సతీమాతలకు దేవాలయాలు నిర్మించి జాతరలు చేస్తున్నారు. రూప్ కన్వర్, దేవరాలీ గ్రామంలో సెప్టెంబరు 4వ తేదీన తన భర్త శవంతోపాటు చితిపై ఎక్కవలసి వచ్చింది. 13వ రోజున అశేష ప్రజానీకం 'చునార్' ఉత్సవానికి తరలి వచ్చారు. ప్రభుత్వ లెక్కల ప్రకారం హాజరైన వారు రెండున్నర లక్షల మంది. ఇతరుల లెక్కల వారి సంఖ్య నాలుగు లక్షలు. బస్సులను పోలీసువారు ఆపినా, కాలినడకన, బండ్లుకట్టుకొని స్వంత మోటారు వాహనాలపై లక్షల జనం వచ్చారు. ఈ దురాచారానికి ఎంత మత ప్రాబల్యం ఉందో దీని వల్ల తెలుస్తున్నది.

ఇలాంటి దుశ్చర్యలను అరికట్టడం ఎలా? వెంటనే ప్రభుత్వం గుర్తుకు వస్తుంది. శాసనాలు సరిగా లేవని గ్రహిస్తాం. కట్టుదిట్టమైన శాసనాలు కావాలని కోరతాం. అయితే కేవలం శాసనాలు ఉపకరిస్తాయా అనేది చిక్కు ప్రశ్న. శాసనాలకు ప్రజాభిప్రాయం లేకుంటే లాభం లేదు. కాగా ప్రజాభి ప్రాయాన్ని సమకూర్చి శాసనం చెయ్యాలా లేక శాసనం చేసి ప్రజాభి ప్రాయాన్ని సంతరించాలా అనేది ప్రశ్న. ప్రజాభిప్రాయం బలంగా ఉంటే తప్ప ఏ శాసనమూ చేయరాదంటే అసలు ప్రగతి రాదు.

రాజస్తాన్ రాష్ట్రంలో సతీమాతలకు దేవాలయాలు ఉన్నాయి. వాటి దగ్గర ఏటా జాతర్లు జరుగుతాయి. రూప్‌కన్వర్‌కు దేవాలయం నిర్మించాలని ప్రయత్నాలు మొదలయినయి. దానిని నిరోధించడం ఎలాగని శాసన సభలో చర్చలు సాగాయి. దేవాలయ నిర్మాణాన్ని నిరోధించడం అన్యాయమని, అక్రమమని జనతా, భారతీయ జనతా పార్టీ లాంటి ప్రతిపక్షాల నాయకులు-అందులో రాష్ట్ర స్థాయి నాయకులు-ప్రకటించారు. దీనిని బట్టి ప్రజల చైతన్య స్థాయి తెలుస్తున్నది. కేంద్ర ప్రభుత్వాధినేత రాజీవ్‌గాంధీ దీని విషయమై ఇరువది రోజులు ఊరుకున్నారు. ఇక ఒత్తిడికి తట్టుకోలేక రాష్ట్ర ప్రభుత్వాన్ని తగు చర్యలు తీసుకోమని హెచ్చరించారు. దాంతో రాష్ట్ర ప్రభుత్వం కదిలింది. ఇప్పటికి 78 మందిని ప్రభుత్వం అరెస్టు చేసింది.

ఇక ఆర్డినెన్సును గురించి పరిశీలిద్దాము. సతి అంటే ఏమిటో నిర్వచనం చేసింది ఆర్డినెన్సు. భర్త శవంతోపాటు లేక భర్తకు సంబంధించిన వస్తువు, సామగ్రి, లేక వస్త్రగంధాదులతోపాటు వితంతువును తగలేసినా లేక పూడ్చి పెట్టినా అది 'సతి' అనబడును. అది ఆమె ఇష్ట ప్రకారం జరిగినా లేక ఇతరత్రా (బలవంతంగా) జరిగినా అది సతీక్రిందనే లెక్క.

సతిని ప్రోత్సహించు చర్యలు పలురకాలు. వితంతువు సరియైన మనఃస్థితిలో ఉన్నా లేక మత్తువల్లనో దిగ్భ్రాంతి వల్లనో స్వతంత్రంగా ఆలోచించగల స్థితిలో లేనప్పుడు తనను తగలేసుకోవాటానికి లేక తగిలేయించుకోటానికి లేక పూడ్చిపెట్టబడటానికి ఆమెను ప్రోత్సహిస్తే అదినేరం. సతీ సహగమనం చేస్తే తనకు గాని, తన భర్తకుగాని, తన కుటుంబానికిగాని, అధ్యాత్మికలాభం కలుగుతుందని (పుణ్య లోకాలు వస్తాయని) ఆమెను నమ్మిస్తే అదినేరం. సతిని నిరోధించటానికి పోలీసులో తమ విధి నిర్వహణలో చేసే ప్రయత్నాలకు నిరోధం కలిగిస్తే అదినేరం. వితంతువు తగలేయ బడకుండా ఆమె తప్పించుకోవటానికి చేసే ప్రయత్నాలను అటకాయించడం నేరం. సతీసహగమనం జరిగిన ప్రదేశంలో ఉండి, ఆ సంఘటనలో పాల్గొనటం నేరం. దాని సంబంధమైన మత తంతుల్లో పాల్గొనడం తప్పు! సతీ సహగమనం చేయటానికి ఆమె కృత నిశ్చయం సడలకుండా ఆమెను ప్రోత్సహించడం, సహగమనం చేయటానికి

పురికొల్పడం, సతీ సహగమన సందర్భముగా జరిచే ఊరేగింపులో పాల్గొనడం సతీ సహగమనం చేయటాన్ని వితంతువుకు బుద్ధిపూర్వకంగా సహాయం చేయటం శాసన వ్యతిరేక చర్యలు. వీటన్నింటికి శిక్షలు నిర్దేశింప బడినాయి.

సతీసహగమనానికి ప్రయత్నించిన స్త్రీకి 1 నుండి 5సం॥ల శిక్ష పేర్కొన బడింది. సతీ సహగమన నేరాన్ని ప్రోత్సహించిన వారికి, సహాయ పడిన వారికి జీవిత ఖైదు లేక మరణ శిక్ష విధించ వచ్చును. సతీ సహగమ నాన్ని ఉజ్వలంగా మంచి దాన్నిగా చిత్రించేవారికి 5 వేల రూపాయల వరకు, జరిమానా మరియు 7 సంవత్సరాల వరకు జైలు శిక్ష వేయ వచ్చును. అంతే గాక, సతీమాతల ఆరాధన కొరకు నిర్మించే దేవాలయాలను, కట్టడాలను పోలీసుల సాయంలో జిల్లా మేజిస్ట్రేటులు పడకొట్టించ వచ్చును. అందుకయ్యే ఖర్చు ఆ దేవాలయం, మందిరం లేక కట్టడం నిర్మించిన వారివద్ద వసూలు చేయవచ్చును.

అంతేగాక గ్రామాది కారులు, నిర్దేశింపబడిన తతిమ్మా అధికారులు సతీ సహగమనం జరగబోతున్నదని, లేక జరిగిందని సమాచారాన్ని దగ్గరనున్న పోలీసు స్టేషనుకు తెలియజేయాలి. అలాగే పోలీసు అధికారులు, ఇతర అధి కారులు తెలియ జేయాలి. లేని యెడల జరిమానాతో పాటు రెండు సంవత్సర ముల వరకు జైలు శిక్ష విధించ వచ్చును. అంతేగాక ఈ నేరాలను విచారించ టానికి ప్రత్యేక కోర్టులను రాష్ట్ర ప్రభుత్వం నెలకొల్ప వచ్చును. అందులో జిల్లా జడ్జి లేక సెషన్సు జడ్జీలు న్యాయ నిర్ణేతలుగా ఉంటారు.

బలవంతపు సహగమనం అన్యాయమని కాగా స్వేచ్ఛగా చేసే సతీ సహగమనం పవిత్రమని జగద్గురు పూరీ శంకరాచార్య ప్రకటించారు. ఆర్డి నెన్సు ప్రజాస్వామ్యానికి అవమానమట. రాజపుత్ర స్త్రీలు జరిపే సతీ సహగ మన పవిత్ర కార్యాన్ని ఇది అపహాస్యం చేయటం అట. మతవాదం ఎంత మౌఢ్యంలోకి పోయిందో. ఉంత మహిళా వ్యతిరేక మయిందో గమనించాలి.

సర్వోదయ నాయకుడు సిద్ధరాజు ఢడ్డా "ఇది హ్రస్వదృష్టితో కూడిన చర్య; దురదృష్టకరం" అనిఅర్డినెన్సును అభివర్ణించారు. ప్రజాభిప్రాయం ఎంత ఃర్ధూరమైనదైనా శాసనం ద్వారా దాని నిరోధించ పూనటం అవివేకమని బాల్యవివాహం, అస్పృశ్యత—లాంటి సర్వజనులు చెడుగా అంగీకరించే వాటి విషయం లోనే శాసనాలు వైఫల్యం చెందడాన్ని గుర్తించాలని వారు అభిప్రాయ ప్రకటన చేశారు. ఇది పూత మెరుగు భాషణం. అస్పృశ్యతపై జనాభిప్రాయ సేకరణ జరిగిందా? మరి అస్పృశ్యతా నిషేద శాసనాన్ని ఎందుకు గాంధేయ వాదులు సమర్ధించారు? బాల్యవివాహమయినా, అస్పృశ్యత అయినా లేక సతీ సహగమన మయినా మానవ హక్కులకు భంగకరం కనుక, స్త్రీ జాతికి తీరని అపచారం చేస్తున్నాయి కనుక, వ్యతిరేకిస్తున్నాం; ఖండిస్తున్నాం. వాటిని నిషేదించే శాసనాలను బలపరుస్తున్నాం; సమర్థిస్తున్నాం.

ఇలా ఓట్ల కొరకు రాజకీయ వాదులు, కుహనా తర్కంతో కొందరు సంస్కరణ వాదులూ, సనాతన హిందూ మతాచార్యులూ ఈ శాసనాన్ని దుయ్యబట్టటం శోచనీయం. స్త్రీ జాతి ఈస్థితిని గ్రహించి పురోగమించటం అత్యవసరం.



# మొనాష్టరీల్లో మహిళల ధ్యానం
# అర్థంలేని త్యాగం

హైకోర్టులో రిట్ వేశినా, మహిళా సంఘాలు అలమటించినా, ప్రజలు ఆందోళనలు జరిపినా నవంబరు 22న ఏలూరు మొనాష్టరీలో 9 మంది క్రైస్తవ సన్యాసినులు ప్రవేశించటం చాలా ఘోరాతి ఘోరం. రిట్ మధ్యకాలంలో మొనాష్టరీని సన్యాసినుల వసతి గృహంగా మార్చారు. ఇది సభ్య ప్రపంచాన్నే కలవరపరిచింది. మహిళాలోకాన్ని దిగ్భ్రాంతిలో ముంచెత్తింది. ఈ సంచలనానికి కారణభూతమైన అంశాలు ఏమిటి?

సన్యాసినుల మఠాల సంగతి ఇలా ఉంటుంది. పాప పంకిలంనుండి ఈ లోకాన్ని ప్రక్షాళనం చేయటానికి, లోక కల్యాణంకోసం మొనాష్టరీలోని సన్యాసినులు నిరంతరాయంగా ప్రార్థనలు చేస్తువుంటారు. చుట్టూ పది అడుగుల ఎత్తుకల గోడవుంది. వారికి బైటి ప్రపంచంతో ఎలాంటి సంబంధం వుండదు వారు జీవితాంతం వెలుగు, ప్రజల్ని చూడకుండా ప్రార్థనలు చేస్తూవుంటారు. ఆ ధ్యానం వల్ల బిషప్పుకు శక్తి సమకూర్చితే ఆ శక్తితో బిషప్ ప్రజల కష్ట సుఖాలను తీర్చుతారని ఇదొక 'ప్రేయర్ పవర్ హవుస్'లా పని చేస్తుందని చెప్పారు. ఒక గోడకు వున్న కిటికీ వంటి దానికికాక ఇనుప గిన్నె బిగించారు. ఆ రోలర్ షట్టర్ తిరిగినప్పుడు అందులోపెట్టి పంపిన ఆహారం మాత్రం వారికి చేరుతుంది. వారి ఖననం కూడా ఆ ఆవరణలోనే ఏర్పాటు చేశారు. మొదటి వ్యక్తిని మిగతావారు సమాధి చేస్తే తరువాత వారిని అలాగే చేస్తూ వుంటారని చెప్పారు. బిషప్పు మాత్రం సంవత్సరానికొకసారి మాత్రం వెళ్ళిచూచి వస్తాడు. వారి గదికున్న ఒకే ఒక ద్వారాన్ని తాళంవేసి సీలు చేస్తారట. ఇలా వారు జీవితాంతం ప్రార్థనలు చేస్తూనే సజీవ సమాధి అయిపోతారట.

మొనాష్టరీలోకి వెళ్ళే సన్యాసినులు ఇష్ట పూర్వకంగానే వెడుతున్నట్లు మతాధికారుల వాదం. స్వచ్ఛందంగా ఎవరైనా చావటానికి ఇష్టపడతారా? ఒక వేళ వారు అలా అన్నా అభ్యుదయ వాదులం, సంస్కరణావాదులం వారిని ఆ దుష్టశక్తుల బారినుండి కాపాడాల్సిన బాధ్యత మనకు లేదా? మనలో మానవత్వం నశిస్తోందా అనేది మరో ప్రశ్న. మత ముసుగులో మతాధిపతులు స్త్రీలపై నాటి నుండి నేటి వరకు జరుపుతున్న చర్యలలో ఇదొక భాగమని మనకు తెలియనిది కాదు. తర తరాలుగా ఆడవారిని అణచి వేస్తున్న పురుషాధిక్యతకు ఇదో మచ్చుతునక. ఈలోక కల్యాణం కాని, పాతివ్రత్యం కాని స్త్రీలే నిర్వర్తించాలా ఇలాంటి మొనాష్టరీస్ 2 వేలు ప్రపంచంలో వున్నాయట. అందులో 20 వేల మంది సన్యాసినులున్నట్లు చెప్పారు. మరి అన్ని చోట్లా స్త్రీలే ప్రార్థనలు, చేసేవారుగా నియమింపబడటం ఎందుకో తెలుసా? అంటే ఆడ వారికి కష్టాలు పడటం, త్యాగాలు చెయ్యటం అనాది నుండి అలవాటైన విద్య. అధికార్యాన్ని, దౌర్జన్యాన్ని, భీభత్సాన్ని చూపి ఆడవారిపై పెత్తనం చేయటం పురుష లక్షణ మయింది. పురుషాధిపత్యాన్ని పోషించేదే మతం. కనుక మత దురహంకా రానికి బలిఅయ్యేది స్త్రీయేనని వేరే వివరించాల్సిన పని లేదు. ఆ దృష్టితోనే ఈ మొనాష్టరీలు సైతం ఏర్పడ్డాయి.

ఆ "సిష్టర్స్"ను అలా శాశ్వతంగా బంధించటానికి మతాధిపతులకు ఎవరిచ్చారు అధికారం? మానవాళికి శాంతిచేకూర్చేందుకు, ప్రపంచంలో పాపాలు తగ్గించేందుకు ఆ అధిపతులు ఎందుకు ఆత్మార్పణ చేసుకోరు? త్యాగానికి స్త్రీలే కావాలా? ఆ మఠానికి చుట్టూ పది అడుగుల గోడ ఎందుకు? వారి మనస్సు మారితే బైటికొచ్చే అవకాశం లేకపోవడం అమానుషం కాదా? సతి ఆచారం అప్పటికప్పుడే చంపుతుంది. కానీ, ఇది 'స్లో పాయిజన్'గా పని చేస్తుంది. ఇది మానవులకుండే సహజ స్వేచ్ఛను హరిస్తుంది. వ్యక్తిత్వాన్ని వమ్ము చేస్తుంది. మానవ సమాజంతో సంబంధం లేకుండా ఉంచటం అమానుషం. ప్రకృతిలో పుట్టి పెరిగిన మనం అంధకారంతో బ్రతకటం మానవ అసాధ్యమేకాదు దుస్సాధ్యం కూడా. ఏ మత ధర్మాలైనా మనిషికి గల విలువలను వమ్ముచేయరాదు, అంతేకాదు, ఒకరి విముక్తి కోసం మరొకరి స్వేచ్ఛ నువమ్ము చేయడం. సహించరాని ద్రోహమవుతుంది. మనంచేసే సేవకు అర్థం

పరమార్థం వుండాలి. సేవాకార్యక్రమంలో సేవచేసేవారికి కాని అందుకొనే వారికిగాని వ్యక్తిత్వం మీద దెబ్బ కొట్టరాదు. మనిషిని మనిషిగా చూడడమే మానవత్వం అంటాం. నిస్సహాయులను, నిరపరాధులను, అమాయకులను మనం శాసించటం, వాడుకోవటం, మన నిర్ణయాలను వారిపై రుద్దటం ధర్మ సమ్మతం కాదు; నైతికమనిపించుకోదు.

ఇలా స్త్రీలను మతస్తులు నిర్బంధించటం ఈనాటిది కాదు; అన్ని మతాలతో జరుగుతున్న అమాయిత్యమని చెప్పాల్సిన పనిలేదు: సహగమనాన్ని గురించి శంకరాచార్యులు చేసిన హెచ్చరికలు విన్నాం కదా: స్వేచ్ఛం దంగా సతిని నిర్వర్తిస్తే తప్పు లేదట. సహగమనాన్ని వేదాలు అనుమతించాయట. సతి నిషేధం ప్రజాస్వామ్య విరుద్ధమట. మత విషయాల్లో రాజ్యం జోక్యం చేసుకోరాదని సెలవిచ్చారు. వేదాల్లో "సతి" లేదని విన్నాం. ఒకవేళ వున్నా ఈ శతాబ్దంలో కూడా ఆచరించాలనడం అవహేళన కదా ! అలాగే ముస్లిం మహిళకు సెక్షన్ 125 క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ (Cr. R. P. C) వర్తించదని శాసనం చేశారు షాబానో కేసు తర్వాత. అంటే భర్త వదిలేసిన ముస్లిం స్త్రీ తిండి లేక చావాలన్న మాట. ఇలా స్త్రీలను హతమార్చడం మత సంస్థలకే చెల్లుతుంది. మొనాస్టరీ కాని,సతికాని, ఆ శాసనం కాని అన్నిటా ఆడదే దగా పడిపోతుంది. పుణ్యం అని కథలు చెప్పి ఆడవారిని పణంగాపెట్టి బలిచేస్తున్నారు. మాతృస్వామ్యం పోయి పురుషుడు యజమాని అయినప్పటి నుండి స్త్రీలపై అత్యాచారాలు అనంతంగా జరుగుతూనే వున్నాయి. వాటిలోని భాగమే ఈ మొనాస్టరీలలో స్త్రీ బంధం.

సమస్య స్త్రీలదయినా ఎందరో ఆలోచనా పరులైన పురుషులున్న సమాజం మనది. కనుక సంస్కరణవాదులు, హేతువాదులు, మహిళా సంఘాలవారు, యువతీ యువకులు, విద్యావేత్తలు ముందుకొచ్చి ఇలాంటి కిరాతక చర్యలను ఖండించాలి. స్త్రీ కూడా మానవి అని గ్రహించాలి. ప్రభుత్వం సైతం ఈ చర్యలను నిషేధించాలి. మానవ శ్రేయస్సుకు వాడే మత ధర్మాలలో స్త్రీల అభ్యున్నతిని కూడా చూడాలి. స్త్రీల శ్రేయస్సు, అభివృద్ధి ప్రపంచ

శ్రేయస్సని గ్రహించాలి. మతం పేరిట మోక్షమనే తొడుగులో స్త్రీలను నిర్బంధించడం అనాగరికమని చాటి చెప్పాలి. ఈ క్రమబద్ధమైన విధానాలను ప్రజా సముదాయం మాత్రమే నిర్వహించగలదు. కేవలం చట్టాలు, ఆర్డినెన్సులు, జడ్జిమెంట్లు మాత్రమే మనల్ని రక్షించలేవు. ప్రజాందోళన, ప్రజాభిప్రాయం మీదనే జరుగుతాయి. అందులో మహిళలు పాత్రధారులు సూత్రధార్లు కావాలి. ఇప్పటికయినా స్త్రీలంతా ఏకమై ఈ విధ్వంస కాండను ఎదుర్కొనగలరని ఆశిద్దాం.



# కన్నవారే కన్యలతో వ్యాపారం చేస్తుంటే!!

మానవ నాగరికత తారాస్థాయికి లేచింది. శాస్త్రీయ విజ్ఞానం విశ్వ కవాటాలను చేదిస్తోంది. ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలలో ఎంతో పురోగమించాం. జీవన సరళి మారింది. సగటు జీవితం పెరిగింది. అనుక్షణం ఎన్నో మార్పులు శరవేగంతో దూసుకొస్తున్నాయి. లలిత కళల్లో, చేతిపనుల్లో, వృత్తి విద్యల్లో, వ్యాధి నిర్మూలనంలో నూతన పోకడలు తొంగిచూస్తున్నాయి. పరిశ్రమల్లో, వ్యవసాయరంగంలో, జీవిత విధానంలో అద్వితీయమైన మార్పులొచ్చాయి. వివాహవ్యవస్థలో, కుటుంబ జీవితంలో, భార్యా భర్తల అనుబంధంలో నూతన పంథాతో పయనిస్తున్నాం. విదేశ విధానంలో, శాంతి స్థాపనలో, ఆటల్లో పోటీల్లో ఒకటేమిటి—మానవ జీవిత సరళే మారిపోయింది. ఒకప్పుడు దేవుడనుకున్న చంద్రుడి నెత్తిమీద నాట్యం చేస్తున్నాం. ఆర్టిఫీషియల్‌గా 'లేబరేటరీలో' కృతిమ జీనును సృష్టించాం. గర్భస్థ పిండానికి కూడా వ్యాధిని పరికించి నిర్మూలిస్తున్నాం, గర్భస్థ పిండం ఆడో, మగో, ఏ లింగమో చెప్పగలుగుతున్నాం. 'రోబట్' అనే యంత్రాన్ని తయారు చేసి, మానవ మేధస్సు చేసే పనులన్నీ ఆ యంత్రం ద్వారా చేయిస్తున్నాం. ఆనకట్టలు కట్టి జల ప్రళయాన్ని ఆపుతున్నాం. ఈనాడు ఎన్నో అసాధ్యాలు సాధ్యాలవుతున్నాయి. మరి ఈ పరిస్థితిలో మన ఆడ పడుచుల దీనావస్థలో, వారి బాధాకర జీవితంలో మార్పురాలేదు. ఆ విషయం గురించి ఆలోచిస్తే మానవవ్యక్తి అయిన స్త్రీ తన కండలను మానాభిమానాలను అమ్ముకొని జీవించడమనేది ఎంత అనాగరికమో మరెంత దౌర్భాగ్యమో మనకు తెలియనిదికాదు. తరతరాలుగా సాగుతున్న వ్యభిచార వృత్తి మాత్రం మన్నింకా వెన్నాడుతునేవుంది. మన బిడ్డలు. మన అక్కచెల్లెళ్ళు మన తల్లులు ఒళ్ళు అమ్ముకొని జీవిస్తుంటే, ఆ ధనంతో కుటుంబాన్ని పోషిస్తూంటే, ఆ సమాజాన్ని ఏమని పిలవాలి? ఆ నాగరికతను ఏమని కొనియాడాలి అనేవి నేడు మన ముందున్న ప్రశ్నలు.

ఈ వృత్తి లోకి నానా రకాల వారూ వచ్చి చేరుతున్నారు. సంఘ కట్టు

బాట్లకు బలియైన బాల వితంతువులు, భర్తల హింసలు భరించలేని భార్యలు; పెళ్ళికాని తల్లులు భర్తలచేత విడిచివేయబడ్డవారు, కుటుంబ బాధలు ( అత్త మామలు వగైరాలవల్ల) భరించలేని వారు, ముసలి మొగుళ్ళ వల్ల అనుమానింప బడేవాళ్ళు, పారిపోయినవారు బ్రోకర్ల ద్వారా ఈ ఊబిలో దిగబడి పోతున్నారు ఇక పెళ్ళాడుతామని నమ్మించి మోసం చేయ బడ్డవారు రేప్ చేయబడ్డ వారు కూడా దారీతెన్నూ గమ్యం లేక ఈ ఊబిలోకి ఈడ్చబడుతున్నారు. సినిమాల్లో చేరుస్తామని, ఉద్యోగాలిప్పిస్తామనే ఆశ చూసి నాశనం చేయబడ్డవారూ, ఇందు లోకి చేరిపోతున్నారు. అన్నింటికన్నా ముఖ్యమైనది ఆర్థికం. దుర్భరమైన దారి ద్ర్యం వల్ల ఆడపిల్లలను అమ్మకానే తండ్రులు, అన్నదమ్ములు, వున్న సమాజం మనది. అలాగే ఇష్టంగానో అయిష్టంగానో భార్యలను వృత్తికి అప్పగిచ్చే భర్తలున్నారని చెప్పడం నేరంకాదు. కుటుంబంలో ఏ కష్టమొచ్చినా, ఏ బాధ వున్నా, మరే అవమానం జరిగినా అన్యాయం జరిగేది ఆడదానికనేది నగ్న సత్యం. అంటే భర్తతో తగాదా వస్తే భార్యను, తండ్రితో పేచీ వ_ కూతుర్ని చేరచడం సర్వసమాన్యమయింది.

ఇక వేశ్యల జీవితాలు సర్వే చేస్తె చాలా హృదయవిదారకంగా వుంటాయి. తలకొక కథ. జీవితానికొక సమస్య. వ్యక్తికొక విషవలయం వున్నాయి. తుదీ మొదలూ లేని చిక్కుపడిన దారపు వుండలు వారు. గమ్యంలేని ప్రవాహం వారి జీవితం. మోడుబారి చిగురించని అభాగినులు ఎవరంటే వేశ్యలని చెప్పు కోవచ్చు. మైనపు ఒత్తుల్లా భోగ పురుషులకు, కాముకులకు వెలుగునిస్తూ తాము మాత్రం హరించి హతమైపోతున్నారు, పైగా ఎ సమాజమైతే, ఏ పురుషులైతే వారికి ఈ గతి పట్టించారో వారే కులట, పతిత, సానిపిల్ల, అది చెడిందిరా, వగిలిన కుండరా అంటూ దుమ్మెత్తి పోస్తున్నారు. అందుకే వారి జీవితాలు మొద్దుబారి పోయినై. వారిలో చలనం కాని, స్పందనకాని 'యాంబీషన్' కాని కాగడాలేసి చూసినా కనిపించవు,

ఇక వారి యదార్థ గాథలు తెలిస్తే చాలా హృదయ విదారకంగా వుంటాయి. (ఈ సందర్భంగా నా సర్వేలోని కొన్ని విషయాలను మీ ముందు వుంచుతున్నాను.) ఒక పిల్ల తానొక ఘరానా పెద్ద మనిషిని నమ్మి చెడి

పోయానని చెప్పింది. అతడు తనను ఆరునెల్లు వాడుకొని తన 'బాస్'కి అమ్మేశాడని చెప్పింది. సవతి తల్లి పోరు వల్ల ఊరు విడిచి పోయినప్పుడు త్రోవ తప్పానని చెప్పిందొక అమాయకురాలు. తిండీ తిప్పలు లేక తన తండ్రేతన్ని ఈ రొచ్చు గుంటలోకి దించి పొయ్యాడని ఏడ్చింది మరో పిల్ల. తన భర్తే తన్ని రోజూ తేవడము, తీసుకెళ్ళడము చేస్తుంటాడని చెప్పింది మరో అమ్మాయి. ఉద్యోగాలని, ఊరు చూడాలని. సినిమాల్లో చేరాలని ఈ రొంపిలో చేరామన్నారు కొందరు. అలా నానా రకాలవాళ్లు ఈ వృత్తితో జీవిస్తున్నారు, ముఖ్యంగా ఒకసారి మానం పోతే వాళ్ళనింక ఎవరూ పెళ్లాడరనే బాధతో గతిలేక చేరుతున్నామని చాలా మంది వాపోయారు. కొంత మందిభర్తల చాటున రంకు కూడా చేస్తుంటారని వింటున్నాం. ఏది ఏమైనా, ఈ హీనాతి హీనమయిన వృత్తి ప్రపంచం మొత్తం మీద మిక్కుటంగానే వుంది.

ఇటీవల ఒక హృదయవిదారక వార్తచదివాం. అది ఉత్తరప్రదేశ్‌లో శాంశి తెగకు చెందినఆడపిల్లలను, 10 సం.లు పైబడ్డ వారిని, తమ తల్లిదండ్రులు వ్యభిచార గృహాలకు అమ్ముతున్నట్లు తెలిసింది. ఆ ప్రాంతంలో అలా ఆడవాళ్ళ మీద మగవాళ్లు ఆధారపడి జీవించడం చాలా కాలంగా జరుగుతున్న విషయమే. ఆ పిల్లలు తల్లిదండ్రులకు పెద్ద మొత్తంలో డబ్బు పంపుతున్నారట. అలా డబ్బు సంపాదించటం అలవాటు పడ్డ తండ్రులు మిగతా ఆడపిల్లల్ని 10,15 వేలకు ఏజంట్లకు అమ్మేశారట. ఈ విధంగా కొన్ని సంవత్సరాలలో ఆ ప్రాంతంలో అనేకమంది ఆడబడుచులను కన్నవారే వృత్తికై పంపుతున్నారంటే ఎలా సహించగలం? అలా వేశ్యలయిన వారిలో కొంత మంది బలవంతంగా ఆ వృత్తిలోకి నెట్టబడ్డారు. మరికొంతమంది జీవనోపాధికి చేరిన వారున్నారు. అందులో కొంతమంది అరెస్టు చేయబడ్డారు కూడా. తర్వాత కొంతమంది సంఘ సభ్యులు తమ కుటుంబాలలో ఆడపిల్లలను ఆ వృత్తిలోకి దింపము అని ప్రతిజ్ఞలు చేశారు. కాని ఎవరైతే అలాంటి ప్రతిజ్ఞలు చేశారో వారే తమ కూతుళ్ళను అమ్మటం మొదలుపెట్టారు. కొంతమంది పిల్లల్ని పోలీసులు, ప్రభుత్వం బయటికి తెచ్చి పెళ్లిళ్ల జరిపించారు. కాని వారికి పోషణ జరగక మళ్లీ అదే వృత్తిలోకి వెళ్ళటం జరిగింది. దానికి కారణం ప్రభుత్వ సహకారం లేమి పోలీసుల నిర్లక్ష్యం ఒక పంక అయితే తండ్రుల ఆశాపాశం. అమ్మాయిల

భోగలాలస. అన్నీ కలిసి మళ్లా మొదటికొచ్చింది వ్యవహారం. అసలు ప్రాంతీయ పోలీసులే తల్లిదండ్రులకు, మధ్య వర్తులకు వేశ్యల సరఫరా చేసే వారికి రక్షణ యిస్తున్నారనే వార్త కూడా వచ్చింది. ఇవన్నీ ఒక ఎత్తు, కన్న తండ్రులే ఆడపిల్లలను అమ్ముకోవటం మరీ ఘోరం. వృత్తిద్వారా కుమార్తెలు సంపాదించే రాబడిపై తల్లిదండ్రులు జీవించడం, తద్వారా ధనవంతులవడం గూర్చి ఆలోచిస్తే మన సంస్కృతి ఏ దోవకు పోతోందో అర్థం కాకుండా వుంది. దీనినే "కంచే చేనుమేస్తే" అన్నట్టు బిడ్డలపై కనికరం, దయ లేకపోయినా, కన్న ప్రేమను కూడ తృణీకరించి అమ్మాయిల రక్త మాంసాల పైవారి సమాధులపై ఇళ్ళు కట్టుకుని సుఖపడే తండ్రులని ఏమని పిలవాలి వారు అసలు పిల్లల్ని కనకపోయినా మేలనిపిస్తుంది. బిడ్డల్ని కన్నందుకు వారిని ఉత్తమ పౌరులుగా చేయాల్సిన బాధ్యత ఆ కన్నవారిక్కుందని గ్రహించక పోవడం శోచనీయం. ఇది సభ్య ప్రపంచానికే సిగ్గుచేటు. పిల్లల్ని దేశ దిమ్మరులుగా. దొంగలుగా, హంతకులుగా తయారు చేయటం విద్యా విహీను లనుగా చేయటం తండ్రుల దోషంగా భావించి వారికి శిక్షలు వేయాలి. అన్నిటి కంటే నీచాతి నీచమైన వృత్తి వేశ్యావృత్తి. ఆ వృత్తిలోకి వారు దిగటమే మహా తప్పు, నేరము అని అంటున్నాం. అదీ చాలక తల్లదండ్రులే వారిని అమ్ముకోటం, వృత్తిలోకి నెటివేయటం పరమ కిరాతకమని చెప్పాలి. కనుక ఈ దౌర్భాగ్యస్థితికి అంకితమయిన శాఖ తెగ పిల్లలను కాని, ఇతర అడబడుచు లను కాని ఎలా రక్షించాలి అనేది ముఖ్య ప్రశ్న. ఇది చాలా చిక్కు ప్రశ్న అయినా విడదీయలేనిది కాదు. తగిన పట్టుదల, దీక్షావుంటే ఏ పనైనా చేయగలం.

వేశ్యాజాతిని రద్దుచేసి ఆ స్త్రీలను కుల స్త్రీలుగా మార్చాలి. ఇలా అనేక ఆచారాల ద్వారా అమ్మాయిలను బలిచేసే తల్లిదండ్రులకు శిక్షలు విదిం చాలి. పోలీసులు ఈ విషయంలో కడు నేర్పుతో వ్యవహరించి బాలికలని రక్షిం చాలి, తమ బిడ్డల విషయంలో తీసుకొనే జాగ్రత్తలతో సంచరించాలి. కాని వారిని భయభ్రాంతులను చేయరాదు. పరిస్థితుల ప్రాబల్యం వల్లనే వారు అలా పతమారి పోతున్నారనే సానుభూతి సమాజానికి కలగాలి. అంతే కాని వారిని ఈసడిస్తూ అసహ్యంతో చూడరాదు. ముఖ్యంగా ఆ అమ్మాయిలకు పెళ్ళి చేసే

విషయంలో స్వచ్ఛంధ సంస్థలు ముందుకు రావాలి. వారికి ధైర్యాన్ని కలుగ జేయాలి. వారికి మానసిక మార్పు తేగలగాలి. ప్రభుత్వం ఈ విషయంలో చాలా శ్రద్ధ వహించక తప్పదు. వారికి పునరావాసం కలిగించిన నాడు వారు ఈ వృత్తిలోకి దిగరు. ఆర్థిక అసమర్థత తొలగిననాడు వారు ఈ వేశ్యా వృత్తి లోకి రారు. కనుక ప్రభుత్వం ప్రజా అభివృద్ధి కార్యక్రమాలలో వేశ్యా వృత్తిని నిర్మూలించడానికి బడ్జెట్‌లో కొంత ధనాన్ని కేటాయించి వారికి పునరావాసం, విధ్య వివాహం లాంటి సంస్కరణలు చేయాలి.

తల్లి దండ్రులు, ప్రజలు, ప్రజా సంఘాలు, మహిళాసంఘాలు, స్వచ్ఛంధసంస్థలు, ప్రభుత్వం ఇలా అన్ని రంగాలవారు కార్యదీక్షతో పనిచేస్తేనే ఈ అవినీతి వ్యాపారం మటు మాయ మవుతుంది. మరి మనం అందుకు సిద్ధంగా వున్నామా?



# వ్యాపార ప్రకటనల్లో ఆడ బొమ్మల ప్రదర్శన

ఈ నాటి వ్యాపార ప్రకటనల్లో స్త్రీని కేవలం ఒక అందాల బొమ్మగా చిత్రిస్తున్నారు. ఇది స్త్రీ జాతికే కాదు మానవ జాతికే అవమానకరం. స్త్రీ అంటే "సెక్స్ ప్రతీక" అనే భావాన్ని స్ఫురింప జేయటం అనాగరికం అని చెప్పక తప్పదు. ఆడవారిని కించపరిచే ఏ రకమైన భావప్రచారమైనా అది తిరుగుబాటును తెస్తుంది. అవమానితులు, బాధితులు ఎప్పుడో అప్పుడు ధ్వజ మెత్తుతారనే దానికి బోలెడన్ని దాఖలాలున్నాయి. ఆడవారు అబలలు, అండ దండలు లేనివారని భ్రమించటం అర్థరహితం; అది శాశ్వత సత్యం కానే కాదు. స్త్రీలు నిప్పురు కప్పిన నిప్పులా వున్నారు. ఏనాటికో ఒకనాడు అది ప్రజ్వరిల్లక మానదు. అందుకు ముందుగా సన్నాహాలు కూడా జరుగుతున్నాయి

వ్యాపారస్తులకు, ప్రొడ్యూసర్లకు తోబుట్టువులు, భార్యా, కుమార్తెలూ వున్నా వారి వ్యాపారదృష్టి వేరు వారి మానవ విలువలు వేరు. ఆ సమయంలో వారికి దృష్టిదోషం సంక్రమిస్తుందేమో; రానురాను వారి ప్రకటల తీరు తెన్నులు చిత్ర విచిత్రంగా వుంటున్నాయి.

సబ్బులు స్త్రీ పురుషు లిద్దరూ వాడుతున్నా స్నానంచేస్తున్నా ఒక స్త్రీ మూర్తిని అర్ధనగ్నంగా చూపిస్తారు. ప్రభుత్వపు చిన్న పొదుపుల ప్రకటనలో అలంకరించిన ఒక పెళ్ళి కూతురును చూపిస్తారు, అంటే ముందుగా పొదుపుచేసి కట్నం ఇవ్వమని దాని అర్థం, ఒక రంగుల కంపెనీ వారు ఒక అందమైన స్త్రీని ఒయ్యారం పొలకపోస్తూ, క్రీగంటచూస్తూ అలవొకగా అర్థనిమీలిత నేత్ర యైన భంగిమలో చూపించారు. ఆ రంగుల వారికీ ఈ ముద్దుల గుమ్మకు సంబధ మేమిటో! రెండు ప్యాన్ల మధ్య "టీ" షర్టు ధరించిన ముగ్ధరాలిని తమ ప్రకటనలో పైర్ల వారు చూపుతుంటే, మరో పైర్ల కంపనీవారు ఆమె శరీరంపై పైర్లు కదులుతున్నట్లు చిత్రీకరించారు. ఇంక షాంపూలవారు, బట్టలవర్తకులు జుట్టు వీరబోసుకుని, అస్తవ్యస్తంగా "బెడ్ షీటు" చుట్టుకొని. సొంపు వంపులను ప్రదర్శిస్తున్న ఒక ముగ్ధ మందారాన్ని కాముకులు ప్రకోపించే రీతిలో

చూపిస్తుంటే ఆహా! ఆహా! అంటూ ఆనందిస్తున్నారా లేదా మానవత్వమున్న మనిషిని వెలయాలి కన్నా హీనంగా ప్రదర్శిస్తుంటే ఏమని చెప్పాలి? దీనిని అరికట్టడానికి చట్టపరమైన అదుపు వున్నదా లేదా? ఉంటే అశ్లీల నిరోధ శాసనాల స్వరూపస్వభావాలు ఎలా వున్నాయి? అవి అమలు జరుగుతున్నయా? జరిగితే ఇంతగా వ్యాపార రంగంలో అందచందాలొలికే స్త్రీల ఆకృతుల్ని ఎందుకు ప్రదర్శిస్తున్నారు? కనుక ఆసభ్యాన్ని, అశ్లీలాన్ని గురించి తెలిసికోవటం చాలా అవసరం.

ఇటీవల అశ్లీల చిత్రాలను బహిష్కరించాలని అర్ధనగ్న పోస్టర్లను చింపెయ్యాలని అసభ్య సాహిత్యాన్ని నిషేధించాలని ఆందోళనలు విరివిగా జరుగుతున్నాయి. ప్రతి వస్తువు మీద అంటే గుండు సూది మొదలు విమానాల వరకు సబ్బులు పానీయాలు ఆఖరికి పురుషుడు మాత్రమే వాడుకొనే, ఆపవారు వాడుకోని,బ్లేడ్లపై కూడా వివిధ భంగిమలలో అందాలు చిందే ఆడబొమ్మలను అసభ్యమైన స్త్రీ బొమ్మలను చిత్రించి వ్యాపారస్థులు ధనార్జన చేస్తున్నారు. అలా స్త్రీల గౌరవాన్ని దోపిడి చేస్తూ తద్వారా స్త్రీని ఒక వ్యాపార వస్తువుగా అమ్మకునే హీనాతి హీనమైన పరిస్థితికి దిగజారుస్తున్నారు. స్త్రీ జాతినే అవమానించడమని మన బాధ పడుతున్నా.

ఇక సినిమాల్లో స్త్రీ అంగాంగ ప్రదర్శనలు అనేక దృశ్యాలలో సందర్భం లేకపోయినా చూపిస్తున్నారు. ముఖ్యంగా యువతీ యువకులకు వెర్రెత్తించే"రేపు"సీనులను, సెక్సు డాన్సులను, బూతు పాటలను పెట్టి తబ్బు గడించు కుంటున్నారు ప్రొడ్యూసర్లు.

అలాగే సాహిత్యంలో ఎక్కడో అక్కడ అశ్లీల పదాలను పొందుపరచి ప్రజలను పెడదారి పట్టిస్తున్నారు కొందరు రచయితలు. ఇదొక విష వలయంగా ఉంది. ఇంకా ఎయిర్ హోస్టెస్‌లు. ''మోడల్సు'' ''కాల్‌గరల్స్'' సేల్స్‌గరల్స్‌ల అవస్థలు వర్ణనాతీతం. కనుక అసలు ఏది అశ్లీలం. ఏది అసభ్యత. ఏది శృంగారం వీటికి గీటు రాళ్ళు ఏమిటి? ఎవరు నిర్ణయించాలి అనేవి నేడు మనముందున్న ప్రశ్నలు. శృంగారంతో కూడిన ప్రాచీన

సాహిత్యాన్ని ఎందుకు ర్మూలించటం లేదు? అసలు అశ్లీలాన్ని నిరోధించ టానికి మార్గాలు ఏమిటి? అనే విషయాల గురించి ఆలోచిద్దాం.

కామాన్ని పెంచేది, విచక్షణాజ్ఞానాన్ని చంపేది, ఉద్వేగాన్ని రెచ్చ గొట్టేదానినే అశ్లీలం లేక అబ్‌శీనిటీ అని చెప్పుకోవచ్చు ఒకచిత్రం చూచిన ప్పుడుగాని ఒక పుస్తకం చదివి నప్పుడుగాని ఒక శిల్పాన్ని తిలకించి నప్పుడు గాని మనిషిలో సెక్స్ వాంఛను ప్రకోపింప జేసి పాశవిక ప్రవృత్తులను పెంచి కామోద్రేకాన్ని కలిగించి నైతిక పతనానికి దారి తీసేదే అశ్లీలం అంటే, వాటి ప్రభావం వల్ల మనిషి పశుత్వాన్ని సంతరించుకొని తోటిమానవులకు, సమాజానికి, హాని కలిగించేదే అసలైన అశ్లీలం.

అయితే ఇక్కడ మనకొక సందేహం కలుగవచ్చు. మన ప్రాచీన సాహిత్యం ఎందుకు ఇంకా ప్రజాదరణ పొందుతోంది అనేది ఆలోచ నీయాంశం. ప్రాచీన సాహిత్యం ముఖ్యంగా ప్రబంధ సాహిత్యంలో గాని ఖజురహో, కోణారక్ దేవాలయాలపై చెక్కిన శిల్పాలలో గాని స్త్రీ అంగాంగ వర్ణన విపరీతంగా జరిగింది. అందుకు కారణం స్త్రీని అందమైన వస్తువుగా చూచే మనస్తత్వం ఒకటి, కేవలం విలాస పరమైన భోగ్య వస్తువుగా పరిగ ణించడం రెండవది, మరో రకంగా ఆలోచిస్తే శృంగార రసాన్ని కాదనలేము. మానవుడు ఆనందోపాసకుడు, కళాపిపాసి కూడా. చూడండి "వివాద ప్రోద్ధి త కుచోపరి చేలాంచలమైన పీఠడు" అని పోతన అన్నపుడు గాని, ప్రాంచత్ భూషణ బాహుమూల రుచితో పాలిండ్లు పొంగార అని పెద్దనగారు చెప్పి నప్పుడు గాని రాసక్రీడలు, జలక్రీడలు, కుమార సంభవం కళలో సమీకృత మైనప్పుడుగాని శృంగార రసాన్ని పోషిస్తున్నప్పుడుగాని, అశ్లీల భావం స్ఫురించదు. వాత్స్యాయన కామ సూత్రాలు సశాస్త్రీయమైనవి అది భావం ప్రబలంగా ఉంది, అవి చదివితే కామోద్రేకం రాదు. వీటిని ద్వేషించాల్సిన పని లేదు. రోమన్లు, గ్రీకులు నిలువెత్తు నగ్న శిల్పాలు చెక్కారు. అవి చూచి నప్పుడు అశ్లీలత భావం కాని, అసభ్యం దృష్టి కాని, మనలో రావు. కేవలం కళాభిరుచితో వాటిని తిలకిస్తున్నాం. ఆనందానుభూతులను కలిగించే కళాకృతులను, శృంగార రసాన్ని విడిచి పెట్టాలనడం న్యాయంకాదు.

వ్యాపారస్తులు స్త్రీ చిత్రాలను ప్రదర్శించి ధనార్జన చేస్తున్నారని అది స్త్రీ జాతిని అవమాన పరచడం అని దాని విషయంలో పెద్ద ఎత్తున స్త్రీలు ఉద్యమాలు నడపడం లేదని, అలజడి చేయడం లేదని వాదన ఎల్లెడలా ప్రబలంగా ఉంది. కనుక ఆ విషయమై మనం ఒక నిర్ణయానికి రావడం అత్యవసరం.

స్త్రీ రూపాన్ని సౌందర్యాన్ని, శరీరాన్ని వ్యాపార వస్తువుగా ప్రదర్శించి వాణిజ్య వస్తువులుగా చూపడం గర్హ్యనీయం అనడం తప్పదు. ఫలాని సిగరెట్టు త్రాగితే ప్రేయసి హర్షిస్తుందని అంటూ ఒక ఆడ బొమ్మను చూపి అశ్లీల భంగిమల్లో ప్రదర్శించటం దోష భూయిష్టమని చైతన్యం గల స్త్రీ పురుషులు వీటిపై ధ్వజమెత్తి పోరాడాలి. స్త్రీలు సంఘాలుగా ఎర్పడి వ్యాపారస్తుల మీద ప్రకటించే పత్రికల వాండ్ల మీద, సినిమా ప్రొడ్యూసర్ల మీద పోరాటాలు చెయ్యక పోబట్టే రోజు రోజుకూ మితి మీరి పోతుంది. అశ్లీల వ్యాపార రంగం.

ఆ మధ్య ఒక కాముకుడు బంగారమ్మ అనే స్త్రీని చెరిచి హత్యచేశాడు. తాను చదివిన సాహిత్యం వల్ల, చూచిన సినమాల వల్ల తాను ఉద్రేకపడి ఇలా చెరిచానని కోర్టులో ఒప్పుకున్నాడు. అప్పుడు జడ్జి విద్యాసాగర్‌గారు తనతీర్పుతో స్త్రీల అర్ధనగ్న, నగ్న చిత్రాలు యువతరాన్ని క్షణికోద్రేకానికి లోను చేస్తున్నాయని, విచక్షణా రహితంగా పత్రికల్లో, పోష్టర్లల్లో, చిత్రాలలో స్త్రీల అంగాంగ ప్రదర్శన వల్లనే యువలోకం చెడిపోతోందని తమ తీర్పులో వెల్లడించారు బలహీన మనస్కులు, దుష్టగుణ ప్రేరితులు ఈ ప్రకటనలకు బలిఅయి పోతున్నారు.

ఈనాడు ఉత్పత్తిదారునకు, వ్యాపారస్తునికి ఎడ్వర్‌టైజుమెంట్లు, వారధి అయినాయి. సినిమాలు, టివీలు, వాల్‌పోష్టర్లు, రోడ్లపై "హోర్డింగలు" రేడియోలు, స్లైడ్స్. పత్రికలు ఈ ప్రకటనలకు చోటిస్తున్నాయి. అది నేరమూ కాదు, తప్పుకాదు. కాని ఆడ బొమ్మలను రకరకాలుగా అలంకరించి, అనేక భంగిమల్లో 'సెక్స్ సింబల్'గా ప్రదర్శింటంలోనే వస్తోంది విషమపరిస్థితి. అసలు ఈ ప్రకటనలవల్ల స్త్రీలపై నీచభావం, పత్నుడు దృక్పథం, ఏహ్యభావం ఏర్పడే ప్రమాదం వుంది. సర్వలక్షణోపేత అయిన స్త్రీ మూర్తిని కేవలం

సెక్స్‌సింబల్‌గా, వ్యాపార సరుకుగా, ప్రజలదృష్టి నాకర్షించే మోడల్‌గా చూపించడం క్షమార్హం కాకపోగా శిక్షార్హం అవుతుంది. పురుషునికి కామ దాహం తీర్చే కామ పిశాచినిగా ఆమెకు ప్రాణ ప్రతిష్ట చేస్తున్నాయి వ్యాపార ప్రకటనలు, సినిమా పోష్టర్సు. కనుక స్త్రీ లోకంలో ఈ పరిస్థితి గందరగోళాన్ని సృష్టించింది.

ఆమె అంటే అందాల బొమ్మకాదని, సెక్స్ ప్రతీక కాదని సమాజ పురోభివృద్ధిలో దేశాభివృద్ధిలో కుటుంబ శ్రేయస్సులో భాగస్వామి అని గ్రహించాలి. ఇలాంటి పవిత్రమైన భావ ప్రచారం జరగాలి. స్త్రీ అంటే ఒక అందాలరాసి అని, పిల్లల్ని కనే యంత్రమని ప్రచార సాధనమని ఇలాంటి అనాగరిక భావ ప్రచారం నశించాలి. అస్త వ్యస్త ప్రచారాలను, పనికిమాలిన ప్రకటనలను అణగద్రొక్కటానికి స్త్రీ లోకమంతా ఏకం కావాలి. మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలూ, సహృదయులైన పురుషులు ఈ బృహత్తర కృషికి తోడ్పడక తప్పదు.



# ఆడవారి అజ్ఞానం + మగవారి ఆశాపాశం = కరప్షన్

నరకానికి దారి సదుద్దేశ పూరితంగానే సాగుతుంది. అనేది ఒక సామెత వుంది. మనకు రాజకీయ సిద్ధాంతాలు బోలెడన్ని వున్నాయి. సవాలక్ష సామాజిక నీతులు వున్నాయి. శాస్త్రీయ అవగాహన అనంతంగావుంది. ఇక్కడే వుంది ఒక తిరకాసు. అదే "వారి జాతులందు వైవాహికము లందు ప్రాణవిత్తమాన ధనము లందు బొంకవచ్చు ననఘ" అనే ఒక ఘనమైన శుక్రనీతి వుంది. అంటే ఇక్కడ హంతకుడున్నాడా? అని ప్రశ్నిస్తే చూచేవి కళ్ళు చెప్పేది నోరు అని తప్పుకునేటట్లు వుంటాయి మన ధర్మ శాస్త్రాలు, ఆచార వ్యవహారాలు. ఇక ధర్మ సూక్ష్మాలు కొన్ని వున్నాయి. వాటిని మనిష్టమొచ్చినట్లు మలుచుకోవచ్చు. "నూరు కల్లలాడి అయినా ఒక ఇల్లు నిలపాలట" దొంగ, హంతకుడు' వొట్టి వెధవాయి అయినా వాడిచి పిల్లనిచ్చి గృహస్తున్ని చెయ్యాలిట. ఇదొక పరమ ధర్మం. ఇది వింటుంటే నిజంగా ఉన్న మతి కాస్తా ఊడిపోతుంది.

అసలు అవినీతి అంటె ఏమిటి? అది ఎప్పుడు పుట్టింది? ఎలా పుట్టింది. దీనికి కారణం ఎవరు? అన్నప్పుడు కొన్ని సత్యాలు చెప్పక తప్పదు; ఆత్మ విమర్శ అంతకన్నా తప్పదు. అవినీతి ఎక్కడోవుండదు. మన మనస్సుల్లోనే పుడుతుంది. కారణం మనస్సుకు చంచలత్వం వుంటుంది. అది బుద్ధిని లక్ష్య పెట్టదు. ఆలోచించనివ్వదు. అప్పుడు మానవుడు భోగాలకు దాసుడవుతాడు. విషయవాంచాలోలుడవుతాడు. దుష్టమైన అవసరాల విషవలయంలో చిక్కుకుంటాడు. వివేకాన్ని కోల్పోతాడు ఆఖరికి మంచి చెడూ, తనా మనా అనేది లేక వివేక శూన్యుడవుతాడు. ముఖ్యంగా తృప్తి అనే రెండు అక్షరాలకు దూరమవుతాడు. ఇక ఏ గడ్డి కరవటానికైనా సాహసిస్తాడు ఒక సారి మొదలయ్యాక ఇది విష జాడ్యంలా వ్యాపించి చివరికి అతన్నే హతమారుస్తుంది. కనుక తస్మాత్ జాగ్రత్త!

అవినీతి ఎప్పుడు పుట్టింది అనేదానికి సాక్ష్యాధారాలు దొరకవు. రాజరికపు అవశేషాల్లో ఆవతరించింది ముఖ్యంగా అవినీతి. ప్రభువులు దుర్మార్గంగా కప్పాలు, పన్నులు గుంజుకుంటూ అవి కట్టని వారిని కఠినంగా శిక్షించే దశలో పంటలు పండలేదని, ప్రజలు బొంకే వారు. జమిందారీ దశలోనూ భూస్వామ్య వ్యవస్థలోనూ అలాగే జరిగేది. గడ్డి మాత్రమే మిగిలేది. బ్రిటీష్ పాలనలో చాలీచాలని జీతాలవల్ల రహస్యంగా మాత్రమే లంచగొండితనం వుండేది. అలా తరతరాలుగా మన జాతి జీవితంలో, మన సంస్కృతిలో అవినీతి అంతర్భాగమైన ఈనాటికి ఇదొక "ఫ్యాషన్‌గా"గా విషవ్యాధిగా తయారయ్యింది. ఇక ఇప్పుడు అవినీతి, లంచగొండితనం 'పబ్లిగ్గా' జరుగుతోంది లంచాలకు "ఫిక్సెడ్" రేట్లు కూడా ఏర్పడ్డాయి. అంటే మనకు ఇవ్వాల్సిన సమాచారం ఇచ్చినందుకు వది ఇస్తే ఇవ్వరాని దానికి రెండూ మూడు రేట్లు ఇవ్వాలి. లంచం ఇస్తె ఏదైనా కొ వచ్చుననే దృక్పథం ప్రజల్లో ఏర్పడింది. ఇక ఏ ఏ రంగాలలో అవినీతి ప్రవేశించిందంటే చెప్పటానికి వెయ్యి నాలుకలైనా చాలవు. అవినీతి సర్వాంతర్యామిగా, అంతర్ వాహినిలాకా ప్రవహిస్తోంది దానికి తల్లి బిడ్డాలేదు; భార్య భర్త లేదు; శిష్యగురు తారతమ్యం లేదు. వెనుకటి ఒక కంసలివాడు తన భార్య నగలలో కూడా రాగి (కల్తీ) కలిపే వాడట అలా మన సామాజిక వ్యవస్థలో, జీవిత విధానంలో అవినీతి కలిసి పోయింది. పూర్వం ఎవరైనా లంచం ఇచ్చినా పుచ్చుకున్నా అదొక పాపంగా నేరంగా తలచిందినుకునేవారు. ఈనాడు అలాకాదు, బాహాటంగా 'వాడి మొహాన పారేసి' అవని సాధించాలని ధీమాగా గప్పాలు కొడుతున్నాడు. ఆపని చేయలేని వారిని అసమర్థులని హేళన చేసే దాకా వచ్చింది పరిస్థితి,

అవినీతి ఒక మార్గం. ఒక పద్ధతి, ఒక విధానం లేదు. ముఖ్యమైనవి దొంగ రవాణా (బ్లాక్ మార్కెట్) స్మగులింగు. కల్తీ, దొంగతనం, విద్యార్థులు కాపీకొట్టడం మార్కులు కలపడం, టాక్సులు ఎగవెయ్యడం, దొంగలెక్కల ద్వారా వ్యాపారస్తుల అవినీతి లాంటివి కోకొల్లలు, లాటరీలు జూదాలు, మానభంగాలు చాటుగా కట్నాలు, చట్టాలను అతిక్రమించుట, తూకాల మోసం, వ్యభిచార కృహాలు నడపటం, ఆఖరికి న్యాయస్థానాలలో కూడా ఇలా ఎన్నైనా చెప్పుకోవచ్చు. భార్యా భర్తల మధ్య, తల్లీపిల్లల మధ్యా కూడా అబద్ధాలు, మోసాలు ఒకన్ని రెండోవారు దోపిడి చేస్తున్న పరిస్థితులు వున్నాయి. మందులు కల్తీవల్ల మనుష్యులు చస్తున్నారు. ఆహార ధాన్యాల కల్తీవల్ల అంటువ్యాధులొస్తున్నాయి. కంట్రాక్టర్ల మోసంవల్ల బ్రిడ్జీలు కూలిపోతున్నాయి. లంచాలు ఇవ్వానివాళ్ళకి సీట్లు దొరకవు. చదువు నేర్పరు, మందులివ్వరు ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు ఇవ్వరు. ఇలా ఎన్నో మరెన్నో సర్వసాధారణంగా జరుగుతున్నాయి.

మహిళల్లో సైతం అవినీతి లేకపోలేదు. వారికి ఆడంబరాలపై మోజు హెచ్చు; పుత్రవ్యామోహం అధికం. భర్తతెచ్చే జీతం చాలదని, వున్న వనరులు అత్యల్పమని బాధపడుతూ అసంతృప్తితో భర్తలను వేదిస్తూవుంటారు. అధిక సంతానాన్ని కంటూవుంటారు కష్టపడి సంపాదించటం పరువు తక్కువనుకుంటారు. మొక్కులు మ్రొక్కడం, దేవుళ్ళకు ముడుపులు చెల్లించడం పట్టుచీరలపై, నగలపై వ్యామోహం, పెళ్ళిళ్ళలో విందులు, వినోదాలకై ఆరాటం లాంటి విషయాలలో వారికి వారే సాటి, సోమరితనం, బద్ధకం పెరిగి ఈ మధ్య జబ్బుల పాలవటం పెరిగింది. ఎవరి పని వారు చేసుకోవటం హీనమని, బిడ్డలకు విద్య చెప్పుకోవటం కూడా తమ దరిద్రానికి చిహ్నమనే భావం పెరిగి పోయింది. ఖర్చులు తగ్గించుకోలేరు; కష్టపడలేరు. ఈ మధ్య క్లబ్బులో పేకాటలు. వినోదయాత్రలపై మోజు, ఆదునిక వస్తువులపై ఆకాంక్ష లేటెస్టు డ్రస్సులు' లాంటివి ఎవరి తాహతును మించి వారు ఆరాట పడటం అధికమవుతుంది. అందువల్ల పిల్లలు కూడా తప్పుదారి పట్టే ప్రమాదముందని గ్రహించరు. పైగా డబ్బు పోసి కొడుకుకు సీటు కొనమని, కట్నమిచ్చి పిల్లకు ఐ. ఏ. ఎస్. లేక డాక్టర్ని తెమ్మని భర్తలను వేధిస్తూ వుంటారు. భర్తలు మరో మార్గం లేక అవినీతి మార్గాన్ని అవలంబిస్తారు. అంతేకాని "మీ జీతాన్ని మించింది ఎక్కడనుంచి తెచ్చారు? ఎందుకు తెచ్చారు ? అవసరమొస్తే నేనూ సంపాదిస్తా కాని ఈ అవినీతి పని ఎందుకు చేశారు?" అని నిలదీసే భార్యలు దుర్లభమవుతున్నారు. తన కొడుకు బస్సులు తగలబెడితే బాధపడే తల్లులు తగ్గుతున్నారు. కాపీలు కొడితే నీవు "నా బిడ్డవేనా" అని, దూషించే అమ్మలు కావాలి. తన కుటుంబంలో ఏ వ్యక్తి ప్రక్కదారి పట్టినా శిక్షించే గృహిణులు వున్నారా అనిపిస్తోంది. కారణం స్త్రీలలో అవిద్య అజ్ఞానం, సామాజిక స్పృహ, లోకజ్ఞానం దేశాభ్యుదయంపై ఆసక్తి దూరదృష్టి లేమి వల్లే ఈ సమాజానికి మన బిడ్డలను, భర్తలకు నిజాయితీ లోపిస్తోంది. రాజకీయాల్లో బంధు ప్రీతి, ఆశ్రిత పక్షపాతం కులతత్వం, స్వార్థం పదవీ వ్యామోహం ఇంతా అంతా కాదు. ఓట్లు కొన్నవారికి, ఖర్చుపెట్టి పదవులను కొన్నవారికి ఆ నష్టాన్ని ఎలా పూడ్చుకోవాలి, తిరిగి ఎలా ఆ పదవిని నిలుపుకోవాలి. అనే చూపు తప్ప మరొకటి వుండదు. పార్టీల అంతః కలహాల వల్ల అవినీతి ఇంకా పెరుగుతోంది. వ్యాపార సంస్థలు. పారిశ్రామిక

వెత్తల నుండి పార్టీలకు విరాళాలు పుచ్చుకోవటం వల్ల వారిదోపిడిని రక్షించాల్సి వస్తుంది. ఏ ప్రజా శ్రేయస్సుకైతే ప్రజానాయకులవుతున్నారో ఆ ప్రజాసంక్షేమాన్ని పూర్తిగా విస్మరిస్తారు. ఆఖరికి ఉత్తరం, దక్షిణం (సిఫారసు, డబ్బు) లేనిదే జరగదు అనే స్థితి వచ్చింది. దీపమ్ముండగానే ఇల్లు చక్కదిద్దుకోవాలనే నీచ బుద్ధితో నడమంత్రపు సిరికోసం కక్కుర్తి పడే నాయకులున్నంత కాలం ఈ దేశానికి ప్రగతి లేదు. దొంగలే దొరలైతే, రక్షకులే భక్షకులైతే, ప్రజల గతి అధోగతి అవుతుంది. యాంటి కరప్షన్ వారు కూడా యాంటీ తీసేసుకున్నారనే హాస్యోక్తి ఒకటి వచ్చింది. ఇందువల్ల ప్రజల్లో కూడా యథారాజ తథా ప్రజా అన్నట్లు నీతి పూర్తిగా ధ్వంసమై పోతుంది. పెద్ద ప్రమాదం వాటిల్లేది యువలోకానికి, బిడ్డలకు గురువులు తల్లిదండ్రులు, గురువులు ప్రజానాయకులు, ఇంట్లో అమ్మానాన్నలను అనుసరిస్తారు. విద్యాలయాల్లో ఉపాధ్యాయులను, పరిపాలకులను ఆదర్శంగా తీసుకుంటారు. కనుక ఈ మూడు వర్గాలవారు చాలా బాధ్యతాయుతంగా ప్రవర్తించాలి. పిల్లలకు మనం మార్గదర్శకులం అనేది విస్మరించరాని విషయం.

దేశ స్వాతంత్ర్యానంతరం ఎన్నో సంస్కరణలు, మార్పులు చేసుకున్నాం. కాని అవినీతి విషయం పట్టించుకోలేదు. ఇది జటిల సమస్య కాదనుకున్నారు. అందువల్ల అది పెరిగిపోయి ఈనాడు మన అదుపు దాటిపోయింది. ఈనాడు వ్యవసాయంలో, సాంకేతిక రంగంలో, శాస్త్రవిజ్ఞానంలో నాగరికతలో గణనీయమైన విప్లవాన్ని గడించాం. ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టాం కాని మానవ మనుగడకు ముఖ్యమైన మన సంస్కృతిలో అంటే మానసిక మార్పు రాలేదు. ఆ సంస్కరణ రానిదే సమరస భావం రాదు. దానికి మార్గం నైతిక విప్లవం. అది అంత తేలికగా జరిగే చర్యకాదు. దానికి మానసిక శాస్త్రము పాఠ్యాంశంకావాలి.

"కారే రాజులు రాజ్యముల్ కలుగవే వారేరి" అన్నట్లు సంపద శాశ్వతం కాదు. నీతి పరులైన ప్రజలు అవినీతి పరమైన వ్యవస్థలో బ్రతుకలేరు. అక్రమ ధనార్జనకు అర్రులు చాచరు. నీతిబాహ్యులు చీడపురుగుల కన్నా హీనమనే భావం ప్రబలాలి. మానవుడిలో ఒకసారి ఆ మార్పువస్తే మలిన పరుడు కాలేడు. ఒకసారి నైతిక పతనం చెందిన వ్యక్తి పూర్వ ఔన్నత్యాన్ని

పొందడం అసాధ్యమే కాదు అది కల్ల అవుతుంది. మడి మాన్యాలున్నా, ఏడు వారాల నగలున్నా, కోట్ల సంపదవున్నా తినేది గుప్పెడు మెతుకులు మాత్రమే. మన జీవితానికి మించింది వున్నా అది వారసులకొ, దొంగలకో చెందుతుంది. వారికి అర్పించేదానికి మనం మలినులం కావటం ఆత్మద్రోహమవుతుంది నీతిమంతులు నాడూ వున్నారు; నేడూ వున్నారు. అంత మాత్రాన వారు తిండిలేక చచ్చిపోలేదు. పేరు ప్రతిష్టలు గడించుకున్నారు.

విజ్ఞానాన్ని, వివేకాన్ని వాడని మానవుడు పశుతుల్యుడు. మానవ మేధస్సు అద్వితీయం, అనంతం, దానికి పదును పెట్టి వాడాలి. కానిచో అది తుప్పుపట్టి మనల్నే ముంచుతుంది. అత్యాశ అధః పాతాళానికి త్రోస్తుంది దానికి షేక్స్పియర్ నాటకం "మేక్‌బెత్" తార్కాణం. మనం "మేక్‌బెత్‌ల"ము. 'షైలాక్‌లము' కారాదు. బలిచక్రవర్తులం, శిబిచక్రవర్తులం కావాలి. అశాశ్వతమైన జీవితాలకు, సంపదలకు దాసులం కారాదు. సమాజ శ్రేయస్సులో వ్యక్తి, శ్రేయస్సు ఇమిడి వుంటుందనే ఇంగితజ్ఞానం వుంటే అదే మనని కాపాడుతుంది, మన జీవితం చరితార్ధమవుతుంది. ఇలా అందరం దృఢ చిత్తంలో పనిచేస్తే అనతికాలంలో అవినీతి చచ్చిపోయి నీతికి స్థానం వస్తుంది.



# ఇదీ మన సమాజం!

ఫిబ్రవరి 'వనిత'లో 'దాచేస్తే దాగని సత్యం' అనే శీర్షిక క్రింద ఎవరి కోసం బ్రతకాలి' అనే వ్యాసం వ్రాశాను. దానితో ప్రతిస్పందన వచ్చి చర్చ అవసరమయింది.నా వ్యాసంలో కొన్ని ప్రశ్నలను ఉటంకిస్తున్నాను. ఈ గాథలో దాగని సత్యమేమిటి? ప్రతి స్త్రీ తల్లి కావాలనే సామాజిక సంప్రదాయ భావనా లేక అవివాహిత మాతలను ఆదరించలేని సామాజిక దౌష్ట్యమా? లేక తనతల్లి త్యాగాన్ని, బాధమయ జీవితాన్ని అకళింపు చేసుకోలేని ఆ బిడ్డ? తాను తల్లి కావాలన్నా, వద్దనుకున్నా అనుభవించలే, ఆమె అశక్తతా, ఏది సత్యం, అనే వే అవి. దానిపై ఒకరు లేవనెత్తిన ప్రశ్నలు ఇలా వున్నాయి.

అన్నీ తెలిసిన ఆడవాళ్ళు ఇలా ఎందుకు లొంగిపోతుంటారు? 2) పెళ్ళి కాకుండానే ఎవరో నాలుగు తీయటి మాటలు మాట్లాడితే లొంగిపోయే బలహీనత స్త్రీలలో ఉంటుందని పరోక్షంగా చెప్పటమేగద? 3) స్త్రీ పురుషుల క్షణికావేశం వల్లనే స్త్రీ బాధ పడవలసి వస్తున్నది. ఆ విషయం తెలిసిన స్త్రీ తప్పుచేయడం ఎందుకు? 4) తప్పు జరిగితే గుట్టుగా నివృత్తి చేసుకొని పశ్చాత్తాపంతో క్రొత్త జీవితాన్ని ప్రారంభించక బిడ్డను కనడం నా జన్మహక్కు అంటూ లోకానికి చాటుకొని సమాజం ఆదరించదని తెలిసి, ఆబిడ్డను కని వాడిని ఆత్మన్యూనతతో పెరిగే వ్యక్తిలా తయారు చేయడం గొప్పతనమా? 5) రచయిత్రులారా! శీలాన్ని కోల్పోయిన ఆడవారిని ఆదరించండని మీరు సమాజానికి చెప్పకండి. వారిని ఆదరిస్తే సక్రమమైన వైవాహిక జీవితానికి. స్వస్తి చెప్పి, నీతి బాహ్యమైన ఒక వ్యవస్థను ఆహ్వానించడమే అవుతుంది, 6) తప్పు జరిగింది కాబట్టి అందరూ ఆదరించాలని చెప్పటం మరో పెద్ద తప్పు 7) తప్పులను ఆదరిస్తూపోతే కొన్నాళ్ళకు అవి ఒప్పుగా మారవచ్చు, కాదనను. కాని దానివల్ల ఒక పరిశుభ్రమైన ఆరోగ్యకరమైన సమాజాన్ని కోల్పోతాం.

పై భావాలు 69% ప్రజల్లో వున్నాయి కనుక చర్చనీయాంశమయింది. విమర్శకులు లేవనెత్తిన అంశాలలో కొంత తాత్విక చింతన వుంది. అందులో సక్రమమైన వివాహ వ్యవస్థ అవసరమని. పెళ్ళికాని ఆడపిల్లలు తల్లులు కారాదని, అయినా గుట్టుగా గర్భవిచ్ఛిత్తి చేసుకోవాలని, కాలు జారిన స్త్రీని సమాజం ఆదరించరాదని అనేక భావాలు ఇమిడి వున్నాయి. వివాహ వ్యవస్థ వుండాలనే అందరం అంగీకరిస్తున్నాం. అయితే ఏది సక్రమమైన వివాహ వ్యవస్థ? అసలు వివాహం ఎందుకు? కేవలం సంతానోత్పాదనకేనా? లేక స్త్రీ పురుషుల లైంగిక వాంచలను తీర్చుకోడానికేనా? లేక స్త్రీ పురుషుల అన్యోన్యతను ప్రేమాభిమానాలను, సన్నిహితత్వాన్ని ప్రాతిపదికగా కలదా? లేక అన్నింటి కలయికా? అంటే పశువుల కన్నా మానవులు మిన్న అనుకుంటే మొదటి రెండు అంటే సెక్సు, సంతానం మాత్రమే ముఖ్యాంశాలు కావు. చివరిది ముఖ్యమవుతుంది. ఈనాడు హిందూ, ముస్లిం, క్రైస్తవ సమాజాలలోని వివాహాలలో ఈ అంశం ప్రధానంగా ఉంటున్నదా? 5 నిమిషాల పెండ్లి చూపులలో వధూవరులు ఒకరిని గురించి ఒకరు తెలిసికోగలరా? కొన్ని మత సమాజాలలో ఆ పెండ్లి చూపులుకూడా ఉండవే: శాసనం నిషేధిస్తున్నా బాలలకు పెళ్ళిళ్ళుజరుగుతున్నాయే ఆమ్మాయిలు తల్లిదండ్రులు ఎంపిక చేసిన భర్తలతో కాపురాలు చేస్తున్నారే, ముందు కాపురం తరువాత ప్రేమ. ఇంతేకదా! ఇవేనా సక్రమమైన వివాహాలు సరియైన అవగాహన లేకుండా శీలం కోల్పోయినారని నిందించటం భావ్యం కాదు.

అసలు శీలం అంటే ఏమిటి? సత్య సంధత, నిజాయితీ, సహనం ఆదర భావం, నడవడి ఇవి అన్నీ కలిస్తే 'శీలం' అంటాము. కాని స్త్రీలకు వర్తించేటప్పుడు ఇవి లెక్కకు రావే? అవివాహిత యొక్క పురుష సాంగత్యం వివాహిత పరపురుష సాంగత్యం మాత్రమే కనిపిస్తుంది చాలామందికి. అసలు శీలం అనేది దేశ కాల ప్రాంతాలను బట్టి ఉంటుందనే విషయం మరచి పోతున్నారు చాలామంది. ప్రేమకు ప్రాధాన్యం లేకుండా ఇష్టంలేని భర్తతో కాపురం చేయటం, ముక్కూ మొగమూ తెలియని వరునికి-తండ్రి కుదిర్చిన వరునికి_సరే_దేహాన్ని అప్పగించడమే శీలమా? ఇంతగా ఎందుకు స్త్రీయవలసి వస్తుందంటే 'పవిత్రులు' శీలరహితులను నిందించటమే కాక దోషులుగా నిర్ణయించి

శిక్షించాలనే భావాన్ని చెప్పటం వల్ల వ్యభిచార భావాలు ఏనాడూ మనస్సులో కూడా ఆదరించనివారు వ్యభిచారి మీద రాళ్ళు విసరడానికి ముందుకు రమ్మన మని ఏసుక్రీస్తు అంటే ఒక్కరూ ముందుకు రాలేదని బైబిలు కథ. ఇది 2 వేల నాటి మాట. దానిని కూడా కాదని 'శీలరహితులను' కొన్ని మత సమాజాల దేశాలలో లాగ రాళ్ళువేసి కొట్టి చంపాలా?

చివరమాట. 1848 కి పూర్వం సపత్నులతో సఖ్యతతో మెలగడం హైందవ సమాజంలో శీలవతి లక్షణం. ఈనాడు. కూడా ముగ్గురు సపత్నులతో కలసి భర్త సేవ చేయడం శీలవతి ధర్మం ముస్లిం సమాజంలో. విడాకులు కోరడం శీలవతి చేయవలసిన పనికాదు రోమను కాథలికుసమాజంలో. వివాహానికి పూర్వం ఎలా తిరిగినా పెళ్ళి అయిన తరువాత పరస్పర విశ్వాసంతో జీవించడం పాశ్చాత్య వివాహ విధానం చారిత్రక దృక్పథం సామాజిక పరిణామ అవగాహన ఉంటే 'పవిత్రులు' ఇంత మూఢులుగా ప్రవర్తించలేరు.

పెండ్లి అనేది ప్రేమపై ఆధారపడాలని నాబోటి వాళ్ళ అభిప్రాయం, ప్రేమ వివాహాలు కావాలని నా భావన. కట్నంకోసం వంట కత్తె పనికత్తె కొరకు లేక తన సెక్సు వాంఛలను తీర్చే నిమిత్తం మాత్రమే పురుషులు పెళ్ళిళ్ళు చేసుకుంటే దానిని 'ఆదర్శమని' అంగీకరించలేను నేను. స్త్రీ పురుషులు ప్రేమ కోసం అన్వేషణలో కలిసి తిరగడం తప్పుదు. ఆ దిశలో, సంతానాన్ని పొందడం వాంఛనీయం కాదు. ఈ అభిప్రాయాన్ని బలపరచే కారణాల నన్నింటినీ పేర్కొనడం ఇక్కడ వీలుకాదు. కాగా స్త్రీ తగు జాగ్రత్తలు తీసుకోవాలనే మాట వాస్తవమే. అయితే పొరపాటు వల్లనో లేక బుద్ధి పూర్వకంగానో స్త్రీ తల్లికావడం సంభవించవచ్చు. ఆమె ముందు రెండు మార్గాలుంటాయి. గర్భవిచ్ఛిత్తి చేసుకోవటం ఒకటి. బిడ్డను కనడం రెండవది. ఏదైనా అది ఆమె మనోవైఖరి మీద ఆధారపడుతుంది. ఈనాడు వివాహిత స్త్రీకి ఎంత మంది సంతానాన్ని కనాలో నిర్ణయించుకునే హక్కు వాస్తవంలో లేదు. నిర్ణయించేది భర్త. శాసించేది పతిదేవుడు. నవ మాసాలు మోసి కనే స్త్రీ రంగంలో లేదు. తల్లి కావాలనుకుంటే స్త్రీకి ఆ హక్కు ఉంది. అది ఆమె ఇష్టం. మరోమాట. గుట్టుగా గర్భవిచ్ఛిత్తి చేసుకోలేట. ఎందుకు? సమాజం నిందిస్తుందని భయపడి కమూలించిచేసంఘటనా న్యాయంగా ప్రవర్తిస్తున్నదా?

పురుషుని తప్పు పట్టున్నదా : పురుషాధిక్య విలువలను సంతరించుకున్న సమాజానికి. పురుష పక్షపాత దృష్టితో వ్యవహరించే సమాజానికి ఎవరిచ్చారు. ఈ హక్కు ఇలా నిరసించటానికి? వాస్తవ గాథలోని స్త్రీ తప్పు చేసిందని నిర్ణయానికి వచ్చి అపైన భావసౌధ నిర్మాణం చేస్తారు. చాలా మంది మూలానికిపోయి ఆలోచించరు. విడాకులు పునర్వివాహాలు చేసుకున్న స్త్రీలు కాని పురుషులు కాని అవతలి వారితో గడిపిన మధురక్షణాలను కొన్నింటినైనా స్మృతిపథంలో ఉంచుకుంటారు. ప్రేమించిన పురుషుడు సాంగత్యంలో గడిపిన ఆ తీయని కాలంలో జరిగిన కాండ ఫలితంగా స్త్రీ గర్భవతి అయితే ఆ గర్భాన్ని అమె వదిల పరచుకుంటే సమాజానికి వచ్చిన ముప్పేమిటి? అమెను అపవిత్రగా చిత్రించ వలసిన ఆగత్యమేమిటి? తప్పు చేసిన స్త్రీని ఆదరించ రాదని ఒక అభిప్రాయం. వ్యభిచారం రెండు రకాలు. ఒకటి మానసిక వ్యభిచారం. రెండవది శారీరక వ్యభిచారం. కొందరి దృష్టిలో శారీరక వ్యభిచారం మాత్రమేతప్పు ఆలా తప్పు చేసిన వారిని శిక్షించాలని లేక నిరాదరణ చేయాలనే ఆలోచన వారిది. ఒకవేళ అలాంటి స్త్రీ తప్పు చేసిందనే అనుకుందాం. అ తప్పు నైతికమా లేక నేరమా అనే తేడాను కూడా గమనించాలి. నేరంలో ప్రధానాంశ ఉద్దేశ్యం, లేక ఫలితం తెలిసి బుద్ధి పూర్వకంగా ప్రవర్తించడం. వీటినన్నింటిని లెక్కలోకి తీసుకోకుండా మూకుమ్మడిగా శీలరహితులను నిరాదరణ చేయాలని వినాదాలివ్వడం అనుచితం.

ఇక మరికొన్ని అంశాలను తడివి చూద్దాం. స్త్రీలోకానికి కొన్ని బలహీనతలు ఉన్న మాట వాస్తవం పురుష ప్రాధాన్యత సమాజపు విలువలను స్వీకరించటం మొదటి బలహీనత. పెళ్ళి లేనిదే తనకు విముక్తిలేదని ఈ సమాజం చెప్పే బోధనలను విశ్వశించడం రెండవది. క్షణికావేశంలో స్త్రీ బాధపడవలసి వస్తుందని తెలసి ఎందుకు తప్పు చేయడం అనే ప్రశ్నలో కొన్ని పదాలను మనం అర్థం చేసుకోవాలి. ప్రేమను, సన్నిహితత్వాన్ని, సాంగత్యాన్ని ఆపేక్షించడం క్షణిక ఆవేశం కాదు. అది తీవ్రమైన అకాంక్ష. అది నిజాయితీతో కూడిన కొరిక కాగా ప్రేమలేని సెక్సుకు లొంగటం బలహీనత. అది పొరపాటు. మానవులందరూ ఒక దశలో ఉండరు. కొందరిలో ఇంకా పశు ప్రవృత్తి ఉంటుంది. కొందరిలో మానవ లక్షణాలు పెరుగుతూ ఉంటాయి. మరి కొందరు మహోన్నతంగా ఎదిగి పోతారు. శారీరక, మానసిక నైతిక

దశలు ఉంటాయి: మనిషిలో. ఈ సత్యాలను మర్చిపోవటం మంచిదికాదు ఇక్కడ తప్పు, ఒప్పుల ప్రసక్తికాదు. ఉచితానుచితాల ప్రసక్తి ఉండాలి పొరపాటు వేరు, తప్పు వేరు, అంచనాలు తారుమారు అయితే పొరపాటు జరిగిందంటాము. తరువాత పొరపాటును సవరించుకుంటాము. గుట్టుగా గర్భవిచ్ఛిత్తి చేసుకుంటే తప్పు ఒప్పుకాదు. ఆ పని గుట్టుగా ఎందుకు చేయాల్లో ఊహించవచ్చు కష్టం కాదు. సమాజం గర్హిస్తుంది. కనుక, సమాజం అంటే ఏ సమాజం, సమాజం ఒకనాడు బాల్య వివాహాలను ప్రోత్సహించింది. సతీ సహగమనాన్ని జలపరచింది. సపత్నీత్వాన్ని ఆదరించింది. పురుషుల వేశ్యాలోలతను కొనియాడింది. ఆ సమాజమా? ఈనాటి సమాజమా? సమాజం మారుతుంటుందనే సత్యాన్ని గ్రహించడం అవసరం. సమాజం మారాలి. మారకపోతే ప్రగతి లేదు. అభ్యుదయం అసలే లేదు. కనుక ఈనాటి మూఢ విశ్వాస చోదితమైన సమాజాన్ని మనస్సులో పెట్టుకొని వాస్తవగాథలోని స్త్రీని నిందించడం అనుచితం. ఆమె కుమారుని ఆత్మన్యూనతా భావంతో పెంచలేదు. దౌర్భాగ్యపు సమాజం ఆ భావాన్ని ఆ కుర్రవాని బుర్రలోకి చొప్పించింది. అలాచేయటం ప్రస్తుతం సమాజం యొక్క తప్పు. కనుక ఆ సమాజాన్ని నిందించాలి, ఖండించాలి త్రోసి రాజని మార్చాలి. ఇదీ జరగవలసిన పని. ఇది విస్మరించి స్త్రీలోకాన్ని, పొరపాటుకులోనయి తల్లులైన వారిని బుద్ధిపూర్వకంగా అవివాహిత మాతలుగా తయారు అయినవారిని నిందించడం మంచిది కాదు వస్తు నిష్ఠతో గమనిస్తే-అనాలోచితంగా పురుష ప్రాధాన్య సమాజపు నైతిక విలువలను యథాతథంగా స్వీకరించి ఆ సమాజానికి పరోక్షంగా రక్షకభటులై స్త్రీలోకాన్ని నిందిస్తూ ప్రవర్తించటం పురుష పుంగవుల చేత సెభాష్ అనిపించుకోవడానికి ఉపకరిస్తుందేమో కాని స్త్రీ జాతికి శ్రేయస్కరం కానే కాదు.

విమర్శకులు తమ అభిప్రాయంతో రచయితలకు కొన్ని హెచ్చరికలు చేశారు. స్త్రీలోకానికి కొన్ని ప్రశ్నలు వేశారు. వాస్తవ గాథలోని స్త్రీ పాత్ర చేసిన పనిని వ్రాయకుండా నేను దాచి పెట్టటం అనేది చిత్తశుద్ధి, నిజాయితీ వున్న రచయిత చేయలేని పని. నేనుగా అందర్ని 'అన్‌వెడ్ మదర్సు'ను కమ్మని ప్రోత్సహించటం లేదు. కాని ఇది పరిశ్రమలు నాగరికత పెరిగిన

స్త్రీని గౌరవంగా పిలిచే పదజాలం లేకపోవటంలోనే స్త్రీ హోదా ద్యోతకమవు తుంది.

కుటుంబాన్ని నెలకొల్పుకునే హక్కు. జీవిత భాగస్వామిని ఎన్నుకునే హక్కు ప్రతి వ్యక్తికీ వున్నది. కలసి జీవితాన్ని క్రమబద్ధం చేసే పరిణామ ప్రక్రియలో వివాహం ఏర్పడింది. కనుక వివాహమాడటానికి లేక ఒంటరిగా వుండటానికి ప్రతి మనిషికీ హక్కు వున్నదన్న మాట. ఈ హక్కును భారత రాజ్యాంగం గుర్తించింది. లెక్కలేనంత మన దేశంలో అవివాహిత స్త్రీలు వున్నారు. అయితే ఈ హక్కును సమాజం స్త్రీలకు నిరాకరిస్తున్నది. స్త్రీకి వివాహం పరమధర్మమన్నట్టు భావిస్తున్నది సమాజం. అవివాహిత స్త్రీని చిన్న చూపు చూస్తున్నది. కాని ఆ తల్లిని శిక్షించమని ఏ శాసనమూ చెప్పలేదు కనుక స్త్రీకి పెళ్ళాడే హక్కు కూడా వుంది.

విడాకుల హక్కు: కుటుంబ జీవనం బాధాకరమైనప్పుడు భర్తనుండి వేరుగా వుండి జీవించటానికి, వివాహబంధాన్ని విచ్ఛిన్నం చేసుకోవటానికి స్త్రీకి హక్కు వుండాలి. ఏ బంధములోకి అయినా ఇచ్ఛాపూర్వకంగా ప్రవేశించాల కాని బలవంతంగా నెట్టరాదు. అలాగే బలవంతంగా ఆ బంధంలోనే జీవితం గడపమని ఒత్తిడి చేయకూడదు. హిందూ వివాహ శాసనంలోనూ, ప్రత్యేక వివాహ శాసనంలోను విడాకులు పొందటానికి స్త్రీకి హక్కు వుంది. ఇరువురి సమ్మతిపైన విడాకులు పొందే హక్కు ఇవ్వబడింది. కాని కారకులు ఎవరైనా సరే వివాహ రథం కుంటు పడిందని కోర్టువారు నిర్ణయానికివస్తే వెంటనే తప్పొప్పుల జోలికి పోకుండా విడాకులు ఇవ్వాలని వాదించాలి.

మనోవర్తి హక్కు:- వివాహ విచ్ఛేదన విషయంలోగాని తత్ సంబంధమైన వివాదం నిలవలో వున్నప్పుడుగాని స్త్రీ భర్తనుండి మనోవర్తి పొంద వచ్చు. ఈ హక్కును ముస్లిం స్త్రీల పరంగా సంకుచితం చేయటం జరిగింది విడాకులు ఇవ్వబడిన మూడు నెలలు వరకే (ఇద్దతు కాలం) మనోవర్తి పరిమితం చేసింది ముసల్మాన్ మత ధర్మ శాసనం. అనాధలు ఉండరాదనే దృష్టితో సర్వులకూ వర్తించే క్రిమినల్ ప్రొసిజర్‌కోడ్ 125వ సెక్షన్ పరిధి నుండి ముసల్మాన్‌లను తొలగించారు. 1986లో వచ్చిన చట్టంలో, వారిని, మతధర్మ సంస్థ వక్ఫ్ బోర్డు పోషించాలన్నారు.

మత తత్వానికి సంబంధించిన హక్కు:- సంతానాన్ని పొందకపోవటం ఎప్పుడు వద్దనాలో అంతా స్త్రీ అభీష్టంపై ఆధారపడాలి. వివాహిత స్త్రీని విధిగా సంతానాన్ని కనమని శాసించే హక్కు భర్తకు కూడా ఉండరాదు

పురుష సంతానం కలిగే వరకు. ఎంతమంది పిల్లలనైనా-కన్నవలసిందే అనే ఉత్తరువు వేయటానికి భర్తకు కూడా అధికారం వుండరాదు. వివాహానికి సంతాన ప్రాప్తికి ఉన్న సంబంధాన్ని విడతీయాలి. స్త్రీకి తన దేహంపై తనకు ఆధిపత్యం వుండాలి. ఆమె అనుమతిస్తే తప్ప ఆమె దేహంపై భర్తకు కూడా హక్కు వుండరాదు.

గర్భస్రావపు హక్కు:- కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో గర్భస్రావం చేయించుకోవచ్చని కేంద్ర శాసనం 1971లో వచ్చింది. ఇలాంటి శాసనం కెనడాలో, పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలలో కూడా లేదని తెలుసుకోవటం అవసరం. తల్లి ఆరోగ్యం కాపాడటానికి, బిడ్డ అంగవైకల్యంతో పుడుతుందని తెలిసినప్పుడు. ఆమె కోరని గర్భం వచ్చి తీవ్రమైన మానసిక వ్యధకు లోనైనపుడు గర్భస్రావం చేయించుకోవచ్చును.

నిజంగా ఈ హక్కు స్త్రీ విముక్తికి సోపానం అయినా దీని విషయమై కొన్ని మత సమాజలలో అక్షేపణలు అభ్యంతరాలు వున్నాయి.

బాల్య వివాహ నిషేదం:- 1929లో వచ్చిన బాల్య వివాహ నిషేద శాసనం వయస్సు విషయంగా మార్పు చెందుతూ చివరికి 1978లో రూఢి అయింది. అమ్మాయికి 18 అబ్బాయికి 21 నిండకపోతే తల్లిదండ్రులకు శిక్షలు పేర్కొనబడినాయి. కాని ఆ పెళ్ళి చెల్లదని హిందూ ముస్లిం శాసనాలలో చెప్పలేదు. పార్సీల చట్టంలో 14 సం. లోపు చెల్లదని వుంది. మైనర్ల వివాహాలు చెల్లవనే శాసనం ఆవశ్యం రావాలి. స్త్రీ తన జీవిత భాగస్వామిని తానే నిర్ణయించుకోవాలనే సూత్రానికి ఇది అన్వయం అవుతుంది.

నివాసపు హక్కు:- ప్రతి వ్యక్తి శాంతి భద్రతలకు లోబడి తన ఇష్టం వచ్చిన చోట నివసం ఏర్పరుచుకునే హక్కు కలిగి వుండగా స్త్రీలకు ఆ హక్కు నిరాకరింప బడుతున్నది. వివాహిత స్త్రీ అత్తింటికి కాపురానికి పోవలెనని, కనీసం భర్తవున్న చోట వుండాలని ఆచారం. కాని భార్యవున్న చోట భర్త వెళ్ళటానికి హీనంగా భావిస్తాడు. ఇదొక విధమైన ద్వంద్వనీతి అనకతప్పదు

ఇద్దరూ సంప్రదించుకోవాలి. ఆమె సలహా పాటించాలి. హింస, చిత్రహింస అవమాన తరమైన శిక్షలకు ఏ మానవ వ్యక్తి లోను చేయబడరాదు. దీనిని స్త్రీలకు కూడా అన్వయించినా, 'నా భార్యను నేను కొట్టుకుంటాను' చంపు కుంటాను, అంటాడు భర్త. భార్య కూడా భర్తకు వత్తాసు పలుకుతుంది స్త్రీకి కల శారీరక హక్కుకు ఇది భంగకరము.

అర్థికంగా:— స్త్రీకి ఉద్యోగ భద్రతకు హక్కు వుండాలి ఉద్యోగిని పిల్లను పెంచే విషయంలో ఆమె దీర్ఘకాలం సెలవుపై వెళ్ళవలసి వస్తుంది. కొన్ని సమయాల్లో రాజినామా పెట్టాల్సి వస్తోంది. అందువల్ల ఆమెకు వచ్చే ఇంక్రిమెంట్లు ప్రమోషన్లు ఇంకా ఇతర సౌకర్యాలు పోతున్నాయి. సంతానం కనడం ద్వారా సామాజిక ప్రయోజనాన్ని సాధిస్తున్న మహిళకు ఇలా అన్యాయం చేయడం న్యాయంకాదు.

సమాన పనికి సమాన వేతనం:- స్త్రీ పురుషులిద్దరికి చెందాలనే సూత్రం వున్నా వ్యక్తిగత వ్యాపార రంగంలో కట్టుబడిలాంటి పనులలో స్త్రీకి తక్కువ కూలీ ఇస్తున్నారు. ఇందువల్ల స్త్రీలు సమానత్వపు హక్కును కోల్పోతున్నారు.

సాంస్కృతికంగా:— భావ స్వాతంత్ర్యం ప్రకటనా స్వాతంత్ర్యం ప్రతి వ్యక్తికి వున్నా స్త్రీల పట్ల ఇది వమ్ము అవుతోంది. అలాగే విద్యాసము ప్రార్థన స్త్రీకి దక్కటం లేదు. బహుసంఖ్యాకులలో స్త్రీలకు విద్య అక్కర లేదనే భావం వుంది. సాంస్కృతిక జీవనంలో పాల్గొనే హక్కు అందరికి వున్నా, నృత్యం, నాట్యం, లలిత కళలను స్త్రీలు అభ్యసించటానికి, చేపట్టటా నికి, వాటిని వృత్తిగా అవలంబించడానికి స్త్రీలకు అవరోధాలున్నాయి. ఇంకా ముఖ్యమైనది. ఇంటిపనికి స్త్రీకి పరిగణన లేకపోవడం వల్ల స్త్రీలు చాలా నీచంగా చూడబడుతున్నారు.

రాజకీయంగా స్త్రీకి ఓటు వున్నా ఆమె ఉన్నత స్థానాలను పొందలేక పోతోంది. రాజకీయ పార్టీలలో, రాజకీయ సంస్థలలో, అన్ని ప్రజా సంస్థలలో ప్రభుత్వ యంత్రాంగంలో, మంత్రి పదవులలో, న్యాయస్థానాలలో కీలక

పదవులలో మనం స్త్రీలను చూడడం లేదు. కుటుంబ యజమానిగా పురుషుణ్ణి నియమించడం వల్ల చట్టాల్లో ఎన్ని హక్కులున్నా ఆచారాల ద్వారా అవి నిరుపయోగమై పోతున్నాయి. కనుక హక్కును తెలిసికోవటం ముందుగా చేయవల్సిన విషయం. ఆ తర్వాత వాటిని అనుభవించటం అలవర్చుకోవాలి. అలా జరిగినాడే స్త్రీ జాతికి పురోగమనం ఉంటుంది.



# నేటి సాహిత్యంలో స్త్రీపాత్ర చిత్రణ

ఇటీవల అనేక మంది పండిత ప్రకాండుల ఉపన్యాసాలలో పర్యాయ పదాలు పదే పదే దొర్లుతున్నాయి. సారస్వతం, సాహిత్యం అలాంటి పదాలు రెంటిని సమానార్ధకాలుగా వాడుతున్నారు. కాని కొంత స్పష్టత అవసరం. అచ్చయిన దానినంతా సాహిత్య మనుకుంటే పొరపాటేమో. కావ్యలక్షణాలున్న దానిని సాహి ్యమని పేర్కొనడం సముసతమేమో. అలాగే ఒక రచయిత వ్రాసిన దంతా సాహిత్యం కాకపోవచ్చు. సాహిత్యానికి కొన్ని సొగసులు అందాలు, అలంకారాలు, పదప్రై చిత్ర 'శయ్యా, శైలి వుండాలి. ఆ దృష్టిలో చూస్తె ఈనాడు కుప్పలు తెప్పలుగ వెలువడు తున్న దంతా సాహిత్యం క దు.

సాహిత్య విమర్శ మహుముఖంగా సాగవచ్చు. ఒక్కొక్క విమర్శకుడు ఒకానొక గీటురాయితో ఆ కర్తవ్య నిర్వాహణకు పూనుకుంటాడు. కొందరు సాహిత్య వస్తువుకు విలువ కడితే మరికొందరు సాహిత్య రూపానికి ప్రధాన్యత ఇస్తున్నారు. కాగా విషయం ఒకటైనా దాన్ని విశదీకరించడం, వెలువరించడం అనేక రీతుల్లో జరుగుతుంది. ఒకరు చమత్కారాన్ని, సాధనంగా వాడితే మరొకరు అపహాస్యాన్ని, అవహేళనను చేపడతారు. ఒకే సంఘటనను కొందరు "కరుణ రసప్లావితంగా చిత్రిస్తే మరికొందరు చదువరులతో ప్రేక్షకులలో శ్రోతలలో ధర్మావేశాన్ని ప్రకోపింప జేయటానికి ఉద్యుక్తులవుతారు ఇలా. వలు విధాలుగా సాహిత్య ప్రకటన దర్శనమిస్తుంది.

సాహిత్య రీతులను వదలి సాహిత్య వస్తువుకు ప్రాముఖ్యత నిచ్చి సాహిత్యాన్ని మదింపు చేయడం ప్రస్తుత కర్తవ్యం, అందులో "స్త్రీ పాత్ర చిత్రణ అనే అంశాన్ని ప్రధానంగా తీసుకోవలసిన అవసరం సాహిత్యంలో ప్రవేశం గల స్త్రీ విమోచనోద్యమ కార్యకర్తల ప్రప్రధమ కర్తవ్యం. నేటి కాలపు సాహిత్యాన్ని మదింపు చేసేముందు పూర్వ సాహిత్యాన్ని తరచి చూడవలసిన ఆగత్యం ఎంతయినా వున్నది.

ప్రాచీన సాహిత్యంలో అంటే భారత రామాయణాలు, ఇతిహాసాలలో స్త్రీ పాత్ర చిత్రణ సంధర్భోచితంగా సాగింది. ఆనాటి యుగ ధర్మమైన పాతి వ్రత్యాన్ని ఉగ్గడిస్తూనే స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను, అభిలషించిన ద్రౌపది, తన కామితార్థాన్ని ప్రకటించటానికి వెనుదీయని శూర్పణఖ, ఇత్యాదులు మనకు కన్పిస్తారు. అలాగే జానపద సాహిత్యంలోని చానలు చొరవను చూపిస్తారు. మధ్యయుగపు ప్రబంధాలలో నాయికలు ప్రధానంగా శృంగార రసాధి దేవతలు. పురుషుని కామేచ్ఛకు సంకేతాలు. కాగా కొన్ని సన్నివేశాలలో తాము విరహవేదన పడతారు. కేవలం శారీరక సౌందర్యం, లైంగిక ఆకర్షణ ఇష్టఫలసిద్ధి, ఇవి కావ్యమంతటా నిండి నిబిడీకృతమై వుంటాయి. స్త్రీ పురుష అంగాంగ వర్ణన ప్రదీప్తమవుతుంది. అంటే పురుషార్థాలలో తృతీయమైన కామాన్ని పోషించడం రచయితలకు ఇష్ట విషయంగా ద్యోతకమవుతుంది. జీవితంలో కామానికి స్థానమున్నమాట వాస్తవమే. కాని అదే పరమోత్కృష్టమూ, జీవిత ధ్యేయమూ కాదు; కారాదు. మనిషిలోని ఒక ప్రత్యేకాంశాన్ని ప్రధానమైనదిగా చిత్రించడం ఆనాటి సాహిత్యానికి ఉన్న ప్రత్యేక లక్షణం కనుక కొంత పరిశీలన చేద్దాం.

ముఖ్యంగా ప్రబంధ యుగంలో స్త్రీని కేవలం "సెక్స్‌సింబల్"గా చిత్రించడం జరిగింది. నాటి రాచరిక వ్యవస్థలో రాచరిక సంస్కృతిని, సాహిత్యాన్నే కవులు సైతం పోషించారు. అందులో అష్టవిధ శృంగార నాయికలు, చతుర్విధ నాయకులు, అవతరించారు. శృంగార రసం ప్రధానంగా భావించారు. వీరి సాహిత్యంలో కావ్య నాయికలంతా చంద్ర బింబాననలూ హంసయానలూ, గజగమనలే. కాలి గోరు నుండి కబరీ భారం దాకా కచ కుచాది వర్ణనలతో స్త్రీని ఒక అందాల బొమ్మగా చిత్రించే వారు. స్తనాలను ఘటాలతోను, తొడల్ని అరటి బోదెలతోను పోల్చేవారు. ఇంకా పీనస్తని, శాతోదరి, తన్వంగి, మీనాక్షి, కోమలి లాంటి సంబోధనలతో ఆమె శరీర భాగాలను సూచించేవారు. నాటి సాహిత్యంలో స్త్రీకి వున్న గౌరవం, హోదా, స్థానం గురించి వేరే చెప్పాల్సిన పనిలేదు.

స్త్రీకి స్వేచ్ఛగాని, వ్యక్తిత్వం గాని కాగడాలేసి గాలించినా దొరకవు. రత్నహారాలు, వజ్రకంకణాలు, ఏడువారాల నగలిచ్చి అంతఃపురాల్లో పంజరాల్లోని చిలుకల్లాగా బంధించేవారు. ఆ రాణివాసాలు, ఉద్యానవనాలు,జలక్రీడలు చెలికత్తెలతో సేవలందుకోవటం చూచి తాము మహాభోగులమని మురిసిపోతూ వుండేవారు. తాము మర బొమ్మలమని తమకూ సమానత్వం కావాలని ఆనాడు వారికి చెప్పేవారే లేరు. అలా, అలా స్త్రీలు తమకు తాముగా, ఇష్టపూర్వకంగా లొంగి వుండేటట్లు సాహితీ ప్రక్రియల్లో పొందుపరిచారు. స్త్రీ పురుషునకు సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో ఎన్ని విధాల లొంగి వుండాలో, ఎలా అణగి మణగి పడివుండాలో అన్నేదానికి బీజాలు ఆనాడే పడ్డాయి. ఆమాటకొస్తే పురాణయుగపు స్త్రీ పతివ్రతా "ఔన్నత్యాన్ని" అక్షర రూపం చేసింది ప్రబంధయుగం. ఆ కట్టుబాట్ల వలలో స్త్రీ తన ప్రాణాన్నే, పణంగా పెట్టేది, సహగమనం చేసేది, అమ్ముడు పోయేది, అగ్నిలో దూకేది. జూదంలో పణంగా పెట్టబడేది, భర్త అంధత్వాన్ని తానూ స్వీకరించేది. ఇలా ఎన్నో ఆంక్షలు, కట్టుబాట్లు నిర్దేశించారు. సాహిత్యరూపంలో ఆ స్త్రీలను పవిత్ర మూర్తులని కొనియాడారు. ఇలా వేల సంవత్సరాలుగా పురుషాధిపత్యానికి తలవొగ్గిన స్త్రీలు, ఆ భావం తమవిగా చేసుకున్న మహిళలు ఈనాటికీ పారిపోని ఖైదీలుగా బ్రతుకుతున్నారంటే కారణం నాటి సాహిత్య లాలనయే. నేటికీ మన రచయితలు విస్మరింపలేకున్నారు. - పాశ్చాత్య సంస్కృతీ ప్రభావానికి లోనైన భావ కవులు ఊహా సుందరులను చిత్రించుకొని, వాస్తవాన్ని మరచి, గగన వీధులలో విహరించారు. సృజనాత్మకమైన ఊహ వాంఛనీయమే. కాని నేలవిడిచి సాము చేయడం పనికిరాదు కదా ! కాగా ఎంతగా భావావేశం పొందినా కవి ఊహ వెర్రితలలు వేయడం సబబు కాదు. అమలిన శృంగారం పేర అవాస్తవిక స్త్రీ మూర్తులను చిత్రించుకొని వారికోసం ఉన్మత్త ప్రలాపాలు సాగించడం సాహస కార్యమవుతుంది. ప్రబంధ కావ్య స్త్రీమూర్తులు కేవలం శారీరక సౌందర్య ప్రధానులైతే భావ కవితా మహిళాలోకం గుణాలంకార శోభితులు. అయితే ఒక తేడా స్పష్టంగా కనబడుతుంది. ప్రబంధ నాయికల ప్రతీకలు జీవితంలో తటస్థిస్తారు కాని భావకవుల ప్రేయసులు మనకు దర్శనమివ్వరు. ఈనాటి సాహిత్యాన్ని పరిశీలిస్తే అందులో విభిన్న స్త్రీ రూపాలు మనకు ప్రత్యక్షమవుతాయి. మహిళకూడ మనిషే కనుక

మానవునిలో వుండే స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ, జ్ఞానవాంఛ, కార్యవాదిత్వం, వివేచన ఆమెకూ వుంటాయి. వేల సంవత్సరాలుగా అణగారిన జీవితం సాగించిన ఆమె స్వేచ్ఛను ఆశించడం ఆశ్చర్యం కాదు. ఒకనాడు కేవలం పురుషుని బానిసగా జీవితం సాగించింది. తరువాత కాలంలో కాస్త స్వాతంత్ర్యం వున్న వ్యక్తిగా గుర్తించబడిన ద్వితీయశ్రేణి మానిసిగా భావించ బడింది. ఈనాడు స్త్రీ పురుషుల సమానత్వాన్ని సూత్రప్రాయంగా అంగీక రించిన పెద్దలు ఇరువురి శక్తియుక్తులలో తేడాలున్నాయని ప్రకటిస్తున్నారు. దీనిని రెండు విధాలుగా వివరించవచ్చు. సమానత్వాన్ని అంగీకరించడానికి ఇంకా ఇష్టపడక పోవటం ఒకటి, లేక సమానత్వాన్ని సరిగా అన్వయం చేయ లేక పోవడం మరొకటి. ఈనాడు పురుషాధిక్యతా సమాజపు విలువలను సొంతం చేసుకొన్న మహిళలు విశేషంగా నవలా సాహిత్యాన్ని సృష్టిచేస్తున్నారు. ఆ విలువలను ప్రతిపాదిస్తూ వ్రాస్తున్నారు; పాతకాలపు మనోభావాలను అధిగ మించలేక పోతున్నారు. ఇది శోచనీయం. అయితే చాలా మంది రచయిత్రుల పరంగా ఇది అజ్ఞాత ప్రక్రియ. వారు స్వేచ్ఛను ఆశిస్తున్నా, స్వాతంత్ర్యాన్ని అభిలాషిస్తున్నా, వారు సృష్టించే స్త్రీ పాత్రలు చివరకు లొంగుబాటును ప్రదర్శిస్తున్నాయి. ఉదాహరణకు భర్తపై ఎదురు తిరిగిన మహిళ "నీవు కట్టిన సూత్రాన్ని నీ చేతులతోనే తీసివెయ్యి" అని భర్తను అభ్యర్థిస్తుంది. ఆంత తిరుగుబాటు చివరకు ప్రాధేయపడడంతో ముగుస్తుంది. శుభప్రదంగా భావించిన మంగళసూత్రం ఉరిత్రాడు అయితే, తనే ఎందుకు తీసివెయ్యదూ అంటే ఇది బాహ్యరూపంలో విప్లవం వస్తు విషయంగా దిగజారుడు తత్వం. 'నేను అబలను' అనే భావం ఆ పాత్రకు ఇంకా వదలలేదు. తనకు హానిక రంగా పరిణమించిన మంగళ సూత్రాన్ని తన చేతుల మీదుగానే తీసి వేయ గల సాహసం ఆమెకు కలిగిననాడు అది నిజమైన విప్లవం అవుతుంది. కాలం మారుతున్నది. స్త్రీ విమోచన అనివార్యమవుతుంది. కాల ప్రభావాన్ని కాదనలేక, తాము విప్లవకారులమని ఇతరులు భావించాలని తాపత్రయ పడి నందువల్ల ఇలాంటి రచనలు వస్తున్నాయి.

పాతివ్రత్యం, పతి ఆరాధన, గృహిణీత్వం పరమ ధర్మాలుగా భావించే రచయితలు, రచయిత్రులు, వీరి సంగతి మనం పట్టించుకో నక్కరలేదు. వారు గతంలో జీవిస్తున్నారు. గతంలో వూపిరి పీలుస్తున్నారు. వారి మనో-

గవాక్షాలు ఎప్పుడూ మూసే వుంటాయి. వారికి నూతనత్వం అంటే భయం: భిన్నత్వమంటే బెదురు. ఇలాంటి రచయిత్రులు పేరెన్నిక గన్న వారిలో కని పించటం బాధాకరం.

స్త్రీ స్వతంత్రంగా జీవించలేదు. ఎల్లప్పుడూ ఆశ్రయాన్ని కోరుతుంది అనే ఆలోచన విద్యావంతులైన స్త్రీలలో ఈనాటికి కనిపిస్తుంది. ముఖ్యంగా మధ్యతరగతి స్త్రీలు ఇలాంటి భావాలలో మునిగి తేలుతున్నారు. అధిక సంఖ్యా కులైన రచయిత్రులు మధ్యతరగతిలో ఉద్భవించారు. సహజంగా వారు మధ్య తరగతి జీవితాన్ని తమ నవలల్లో, కథలలో చిత్రిస్తున్నారు. 'వాస్తవికత' అనే సాహిత్యరీతిని అపార్థం చేసుకొని, యధాతథ వాదం అనే సూత్రానికి కట్టుబడి నామని చెప్తూ ఈ రచయిత్రులు స్త్రీ లొంగుబాటును చిత్రిస్తున్నారు. స్త్రీ సమా జంలో స్త్రీ యొక్క స్థానాన్ని ఇలాగే వుండాలని, అంటే, పురుషునికి లొంగి పోయి వుండాలని వారు సందేశం యిస్తున్నట్లుగా తోస్తున్నది. స్త్రీస్వాతంత్ర్యాన్ని గాఢంగా వాంఛించే ఒక స్త్రీపాత్ర అయినా లేని నవల మిధ్యా విలువ లను ప్రచారం చేస్తున్నట్లు భావించాలి. ఇదంతా దరహం మీద రచయిత్రులను గురించి చెప్పే మాటలు.

పురుష రచయితలు-ఎవరో కొందరు తప్ప-స్త్రీ విమోచనను సరిగా అవగాహన చేసుకున్నట్లు కన్పడదు. ఎంతగా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను సమా నత్వాన్ని ఇచ్ఛాపూర్వకంగా ప్రతిపాదించినా, తరతరాల నుండి వారిలో జీర్ణించిపోయిన పురుషాధిక్యతా భావం వారిని విడిచి పోలేదు. వారు సృష్టిచేసే స్త్రీ పాత్రలు ఎప్పుడో ఒకప్పుడు, ఏదోరకంగా ఆత్మన్యూనత భావాన్ని ప్రదర్శించడంలో విడ్డూరం ఏమీ వుండదు.

స్త్రీని ఆదిశక్తిగా, మరో రూపంగా ఆరాధ్యదేవతగా, అపర దైవంగా ఆలోచించి తమ రచనలో అలా చిత్రించే వారూ లేక పోలేదు. స్త్రీని బానిసగా, అణగి మణగి వుండే జీవిగా రూపకల్పన చేసే విధానానికి ఇది కేవలం వ్యతిరే కంగా కనపడుతుంది. కాని వాస్తవానికి ఈ రెండు వైఖరులు అవాంఛనీయాలే, ఈ రెండూ బొమ్మాబొరుసూ లాంటివి. కోరేది బానిసత్వమూ కాదు. దైవత్వమూ కాదు సరిసమానురాలైన మానవ వ్యక్తిగా అందరిచేతా మన్నన

పొందాలని ఆమె అభిలాష. కనుక స్త్రీ మూర్తిని దేవతగా, స్త్రీ శక్తిని దివ్యంగా పరిగణించే రచయితల ప్రయత్నాలు మన నిరసనకు పాత్రాలు.

ఇటీవల మంత్రతంత్రాల ప్రభావాన్ని, అద్భుతశక్తుల ప్రాభవాన్ని వెలువరించే క్షుద్రసాహిత్యం విపరీతంగా పుస్తకాల మార్కెట్‌లోకి వస్తున్నది. మనిషిలో అనాదినుండి అద్భుతాల యెడ ఆసక్తి వున్నది. అందు వల్లనే బాలల సాహిత్యం దేవుళ్ళతో, దయ్యాలతో నిండిపోయింది. అంతేకాక, అదే ప్రకృతి రహస్యాలను వెలికి తీయాలనే శాస్త్రవేత్తల తలంపుకు కారణభూత మయింది. ఇదే మానవుని తాత్విక ఆలోచనకు పునాది అయింది. దీన్ని ఆసరాగా తీసుకుని కొందరు రచయితలు క్షుద్రసాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. మానవుడిలో వుండే ఆశ్చర్యాను భూతిని వాడుకొని, అవాస్తవిక కల్పనా సాహిత్యాన్ని సృష్టిచేస్తున్నారు. అందులోని స్త్రీ పాత్రలు కేవలం మంత్ర వేత్తలకు తాంత్రికులకు బలి అయ్యే జీవులు. అంటే అన్యాపదేశంగా స్త్రీలు బలహీనులని, మానసిక దౌర్బల్యానికి లోను అవుతారని, ప్రతి ఘటన చేయజాలని వ్యక్తులని చెప్పడం జరుగుతోంది. ఇది సహించరాని విషయం; క్షమింపరాని ద్రోహం. మన్నింపరాని నేరం. ఇలాంటి సాహిత్యాన్ని, స్త్రీ స్వేచ్ఛను కోరే వారందరూ ఖండించాలి; నిరసించాలి.

రచయితలను పేర్కొని, వారి రచనల నుండి ఉదాహరణలను ఇవ్వకుండా సాహిత్య ధోరణులు మాత్రమే స్పృశించడం జరిగింది. ఇది ఒక రకంగా మంచి పని. పేర్లు పెట్టి వ్రాస్తే పేర్కొన బడిన రచయితలు ఆవేశకావేషాలకు లోను అవుతారు. అలాగే విమర్శకు పూనుకున్న వ్యక్తి కూడ నిష్పక్షతంగా నిర్లిప్తంగా ఆలోచించలేక పోవచ్చు. ఈ రెండు ప్రమాదాలనూ నివారిస్తూ సాహిత్యంలోని పోకడలను గమనించడం శ్రేయస్కరం.

సామాజిక దౌష్ట్యాన్నుండి విముక్తి కోసం కోరే వ్యక్తిగా స్త్రీని చిత్రించడం రచయితల అవశ్య కర్తవ్యం, ఆమెకు వున్న బంధాలు అనంతం. వాటి స్వరూప స్వభావాలను వెలికి తీసి, ఆమె విమోచనకు చేసే ప్రయత్నాలను, వాటిలోని కష్టనష్టాల,ను సాధ్యాసాధ్యాలను చదువరికి తెలియ జెప్పడం రచయిత విధి. కర్తవ్యం కూడాను. ఆ కృషికి రచయితలు, బహు సంఖ్యాకులుగా, పూనుకొనే కాలం వస్తుందని ఆశిద్దాం.

# తుపాను

అడవి బాపిరాజు గారు సుప్రసిద్ధ నవలా రచయిత. గిట్టని వాళ్ళు ఆయనను గురించి ఇలా అన్నారు. "కవులు అతనిని చిత్ర కారుడన్నారు; చిత్రకారులు అతనిని కవి అన్నారు". ఈ అధిక్షేపణ సరిఅయినది కాదు. ఆయన రాసిన 'నారాయణరావు'కు పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. కాగా ఒక్క విషయం. తెలుగువారి పద్ధతులను గురించి ఎగతాళి చేస్తూ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గారుఒకమాట అన్నారు.

"అడివి బాపడి పేరు పడలేదదింకాను పడుతుంది దొరలతో పడిన యపుడు"

పాశ్చాతులు మెచ్చుకున్నదాకా తెలుగువారు, భారతీయులు ఎవరి గొప్ప తనాన్ని గుర్తించరని భావం. కాగా అడవి బాపిరాజుగారిపై మన్నన, ఆదరణ ఉన్నాయి. ఆ వాక్య విన్యాసంలో.

తుపాను సుమారు నాలుగున్నర వందల పేజీల సాంఘిక నవల. దీనిని సమీక్ష చేయాలంటే ఇతి వృత్తాన్ని, కథా సంవిధానాన్ని, పాత్ర పోషణను, శైలిని, గ్రంధ సందేశాన్ని తడవి చూడాలి.

తత్వవిచారం, ప్రేమతత్వం, స్త్రీ విమోచన సిద్ధాంతం, లలిత కళల ప్రాశస్త్యం ఇవన్నీ ఈ నవలలో స్పృశింపబడినయి. భార్యను కోల్పోయిన ఒక అభాగ్యుడు చివరకు తన భార్య చెల్లిలిలో తన ప్రియసిని కనుగొన్న వైనం ఈ నవల కథావస్తువు. పాశ్చాత్య భావాల వల్ల ప్రభావితురాలయిన అతని మరదలు భారతీయ అధ్యాత్మికత విశిష్టతను అంగీకరించి తన బావలో మహోన్నత పురుషుని గమనించ గలగడం ప్రధానాంశం.

కథా సంవిధాన్ని గురించి ఆలోచించే ముందు సంగ్రహంగా కధను తెలుసుకోవటం అవసరం.

వినాయకరావు వెంకట రాజ్యలక్ష్మమ్మలకు ఇద్దరు కుమార్తెలు. పెద్ద కుమార్తె పేరు శకుంతల. వినాయకరావు గారి ప్రాణస్నేహితుని అర్ధాంగి రంగనాయకమ్మ. వారి సుపుత్రుడు శ్రీనాధమూర్తి. శకుంతలను శ్రీనాధ మూర్తికి ఇచ్చి ఆమె 11వ యేట పెళ్ళి చేశారు, ఆమె 14వ యేట కాపురానికి వచ్చింది, 16వ యేట టైఫాయిడ్ జ్వరం వచ్చి చనిపోయింది. ఆ రెండేళ్ళలో ఆమె మూర్తిని అలరించింది. ప్రౌఢంవలె సంచరించింది. మూర్తి ఆమెను కామ దృష్టితో చూచాడు. ఆమె మరణం అతనికి క్షోభ కలిగించింది. అతని మనస్సులో పెను తుపాను రేగింది. దేవుని పైన, సంఘం పైన కోపమూ, కసీ పుట్టాయి. తన తల్లిని తీసుకొని కాశీ చేరాడు. సందర్భవశంగా ఒక పండా రెండవ భార్యకు కామతృప్తి చేశాడు. స్త్రీల బాహ్య సౌందర్య దర్శనా పేక్షతో తిరిగాడు. సర్వం తన భార్య శకుంతలా మయంగా తోచింది. చివరకు ఒక స్వామీజీ దగ్గరకు చేరాడు. ఆయన ప్రోద్బలంతో బదరీనాధం, కైలాస మానస సరోవరం సందర్శించాడు. పాశ్చాత్య భావ వాసనలను వీడి భారతీయ సంస్కృతి ప్రభావానికి లోనయ్యాడు. ప్రముఖ చిత్ర కారుడుగా, శిల్పిగా రూపొందాడు. బాబా ఆజ్ఞ మేరకు శకుంతల చెల్లెలిని అర్ధాంగిగా చేసుకోవాలని చెన్నపట్నం చేరాడు.

శకుంతల చెల్లెలు పేరు హేమకుసుమ సుందరి. చిన్నపుడు బావ చంక నెక్కిన పిల్ల. శ్రీనాధమూర్తి బాబాగారిచ్చిన పేరుతో త్యాగతిశర్వరీ భూష ణుడుగా తిరిగి వచ్చేనాటికి ఆమె బి. ఏ. ఆనర్సులో ఉత్తీర్ణురాలయిన జాన. రూపంలో అక్కపోలిక. పాశ్చాత్య భావప్రభావంలో బోల్షివిక్కుగా మార్క్సు లెనిను స్టాలినుల మానసిక శిష్యురాలుగా అభివర్ణించుకునే స్త్రీ. స్త్రీవిమోచన, సమసమాజ స్థాపన ఆమె ఆశయాలు. ఆమెకు సోఫీ అనే భారతీయాంగ్ల మహిళ, వెంకటరత్నమ్మ పేరుగల తెలుగు ఆడపడుచు ప్రాణస్నేహితులు, ఆమె అందానికి, క్రీడాప్రావీణ్యానికి, సంభాషణా చాతుర్యానికి, స్వతంత్ర ప్రవృ త్తికి ముగ్ధులై ఆమెచుట్టూ ముగ్గురు యువకులు పరిభ్రమించేవారు. నల్లని మేని ఛాయతో, మధురాతి మధురమయిన గాన మాధుర్యంతో విలసిల్లే జగపతి రావు ఆమె అనుగ్రహం కోసం కాచియుండేవాడు. హేమకొంటె కోణంగి. అందరికి పేరులు పెట్టుంది. ఇతనికి "నిశాపతి" అని నామకరణం చేసింది. కండలు తిరిగిన దేహంతో, క్రీడాకారుడై పేరెన్నిక పొంది హేమ కటాక్ష వీక్షణాలకై

వేచియుండే శ్రీనివాస రావు హేమకు మరొక మిత్రుడు. అతడు దేనినీ కల్పించనన్నా కల్పించలేడని, ప్రథమ రాతి యుగపు వాడని, బుద్ధి విషయంగా నిర్వికల్ప మూర్తియని తలచి హేమ అతనికి "కల్పమూర్తి" అని బిరుద నామం ప్రసాదించింది. మూడవ వాడు జానకీరామమూర్తి. భార్యా పిల్లలున్న వాడు. కాగా తన తల్లి దండ్రుల వెంట చిన్ననాడే తీర్థయాత్రలు చేశానని కోతలు కోస్తుంటే హేమ అతనికి "తీర్థ మిత్రుడు" అని క్రొత్త పేరు పెట్టింది. తరువాత ఆమె మిత్రుల జాబితాలలో త్యాగతి చేరాడు. తను ఆమె అక్క పెనిమిటి యనే విషయం తెలియకుండా ఆమె తల్లిదండ్రుల లాలూచీతో జాగ్రత్త పడ్డాడు. హేమ స్నేహితురాలు వెంకటరత్నమ్మ జిజ్ఞాసమెండు. పుస్తకాలు తెగ చదివేది. ఆమె హేమవల్ల "లోకేశ్వరి" గా మారింది. నిశాపతి, కల్పమూర్తి, తీర్థ మిత్రుడు, త్యాగతి అందరూ ఆమెను కోరేవారే. కాగా నిశాపతి, తీర్థమిత్రుడు ఆమె వద్ద చనువు తీసుకోబోయి పరాభవితులయినారు కల్పమూర్తి సాహసించలేదు. త్యాగతి తొందర పడతలచలేదు.

నిరాకరించబడిన నిశాపతి వేరు ప్రదేశానికి వలస వెళ్ళాడు. హేమ నిశాపతి ప్రేమను కాదన్నదని తెలుసుకున్న లోకేశ్వరి, మొదటినుండీ అతనిని అభిమానిస్తున్న లోకేశ్వరి, నిశాపతిని వివాహమాడ నిశ్చయించుకుంది. అతని అభ్యర్థనను అంగీకరించింది. హేమ కల్పమూర్తిని ఖాతరు చేయలేదు. తీర్థ మిత్రుని కాదనుకున్నది. నిశాపతిని తిరస్కరించింది. త్యాగతి మీద గౌరవం పెంచుకుంది. ఇంతలో లోకేశ్వరి సాయంతో త్యాగతి తన జీవిత చరిత్రను హేమకు అందజేస్తాడు. దానితో అతనికి తన అక్క శకుంతలపై గల గాఢమైన ప్రేమ, అతని తప్తహృదయం, అతనికి మనశ్శాంతి చేకూరటం ఇవన్నీ హేమకు తెలుస్తాయి. తనకు తెలియకుండా ఒక సంవత్సరం పైగా నాటక మాడాడని కోపగించుకుంటుంది. శిల్పిగా, చిత్రకారుడుగా తొణకని నిబ్బరం కల మనిషిగా అతని యెడ గౌరవభావం నిర్మించుకుంది. కాని అతని భావాల యెడ నిరసనను దాచలేదు. అతని వద్ద శిల్పం, చిత్రలేఖనం నేర్చుకున్నది. సమాజసేవకు పూనుకున్నది. స్త్రీజన ప్రబోధానికి అంకితమయింది. హేమ స్వతంత్రాలోచనకల ఆడపిల్ల కనక ఆమెను వాదించి ఒప్పించాలని త్యాగతి ప్రయత్నించేవాడు. ఆమెకు అతనిపై కోపంవచ్చింది. అతడు తీర్థమిత్రుని

నిరసించాడు. దాంతో ఆమె కోపానికి అవధులు దాటాయి. తీర్థమిత్రునిపై తనకు ప్రేమలేకున్నా అతనితో లేచిపోతుంది. కాని రహస్యంగా, పిరికితనంగా పారిపోవటం ఇష్టంలేక రైలు మరో స్టేషను చేరగానే దిగి ఇంటికి చేరుతుంది. ఒక వెన్నెల రాత్రి త్యాగతిని తలుచుకొని అతని స్వగ్రామానికి వెళ్ళి అతని పాదాలపై సాంష్టాంగపడుతుంది. అతనిచేత మెళ్ళో మంగళసూత్రం కట్టించు కుంది; ఇదీ కథ. నాయికానాయకుల జీవితాలలో చెలరేగిన తుపాను సమసి పోయింది.

కథా సంవిధానం ఆనాటికి తెలుగునాట క్రొత్తది. కథను ఒకరు చెప్పరు. ముందు హేమ "నేను"తో ప్రారంభిస్తుంది. తరువాత త్యాగతి తన కథను తన గ్రంథం ద్వారా హేమకు వినిపిస్తాడు. త్యాగతి జీవిత గాథలో భాగంగా స్వామీజీ కథనం వస్తుంది. మరల త్యాగతి ఉత్తమ పురుషలో కథ సాగిస్తాడు. అప్పటికి ఇంచుమించుగా ముప్పాతిక పుస్తకం పూర్తి అయింది. దాని తదానంతరం హేమ సుందరి కథను రచయిత చెప్తాడు. కథ చివరి భాగాన్ని "భరతవాక్యం" అని రచయిత వర్ణించాడు. ఈ 'టెక్నిక్'నే గోపీ చంద్ కూడ వాడాడట! బహుశః అది అప్పుడే ఆదరం పొందిన పాశ్చాత్య నవలా రచనా విధానం కాబోలు! ఏదయినా చదువరికి విసుగు జనించలేదు. అది రచయితయొక్క ప్రతిభకు నిదర్శనం.

ప్రధానమయిన పాత్ర పోషణను పరిశీలించే ముందు రచయిత భాషను, శైలిని పరిశీలించటం పొరపాటు కాదు. బాపిరాజు గారి వచన ధారా స్రవంతిగా జాలు వారింది. కాగా కొన్ని ప్రయోగాల సందర్భంగా ఆయన చదువరుల మెప్పును పొందుతాడు; కొన్ని పద సముదాయాలను పరికిస్తే బాధ కలుగు తుంది. "శకుంతుల కౌగిలింతలో అతి గంభీరమైన పరిమళంపు ముంపు ఉండేది" "నేను నా నోరు డెట్టాలు నీటితో కడుక్కోవలసి వచ్చింది," అనేవి ప్రశంశింప తగిన వాక్యాలు కాగా 'లెట్రీను' అనే ఇంగ్లీషు పదం వాడకుండా 'దేహ బాధా నివారణ పుగది' అని రచయిత వాడతాడు. తెలుగుపై అభిమానం వల్లఅంత లావు పదజాలం వాడాడా అని తోస్తే అలా కాదని తేలుతుంది. ఆయనే స్టాండు, హాలు, సోపా అనే ఇంగ్లీషు పదాలు వాడారు. మరి ఈ విచిత్ర బాధ

ఎందుకో! "మా జిల్లాలో ఆయనను గౌరవం చెయ్యని వారు లేరు" అనేది తెలుగు నుడికారమా? అవుననుకుంటే గుంటూరు ప్రాంత మాండలీకం మాత్రం కాదు. ఈ మాట చెప్పిన శ్రీనాదమూర్తి గుంటూరు జిల్లా భట్టిప్రోలు గ్రామ వాసి.

ప్రతి గ్రంథంలోను సూటిగానో లేక అంతర్వాహిని గానో రచయిత సందేశం ఇస్తాడు. సూటిగా చెప్తే కళారూపానికి భంగం కలుగుతుంది. ఈ నవలో ఒక్కటే ఒక్క సందేశం ఉన్నది. భారతీయ సంస్కృతి విశిష్టమై, విలక్షణమై పాశ్చాత్య సంస్కృతి కన్న గొప్పది. ఎంత వారయినా కాంత దాసులే, అని పాడే ఫక్కీలో ఎంత వారయినా ఎవరయినా చివరకు అందులో లీనం కావలిసిందే అనేది గ్రంథ ప్రబోధం. దీనిని అందరు ఆమోదించరు. ఆమోదించలేరు. దేశ కాలాలను బట్టి సంస్కృతి రూపాలు మారినా మానవ సంస్కృతి ఒకటే. అది ధారా వాహికం. దేశ భక్తి పేరుతో మానవ మేధస్సుకు అపచారం చేయపూనటం పొరపాటు.

ఈనాటి నవలలకు 1940వ దశకం నవలలకు ఎంతో తేడా వుంది. ఆనాడు నవలలలో వర్ణనలు, తాత్విక చర్చలు, శాస్త్ర విషయాలు చోటు చేసుకునేవి. బాపిరాజుగారి 'తుపాను' చదివితే చిత్రలేఖనం, శిల్పం, భారతీయ తాత్విక భావన, జీవిత సరళి గోచరం అవుతాయి.

లోకేశ్వరి పాత్ర పోషణలో బాపిరాజు గారు ఎంతో జాగ్రత్తగా వ్యవహరించారు. కాని రెండు ప్రధాన పాత్రలయిన త్యాగతి, హేమ సుందరి విషయంగా వారు పప్పులో కాలు వేశారు. ఈ విమర్శ యొక్క బాగోగులను మదింపు వేయాలంటే ఆయా పాత్రల స్వభావ పరిణామం గమనార్హం. ముమ్ముందుగా ఒక్క విషయం స్పష్టంగా చెప్పాలి. ఏ రచయితను "ఫలాని పాత్రను నీవు సృష్టించు" అని ఆదేశించే అధికారం చదువరికి లేదు. కాగా ఆపాత్ర స్వభావోచితంగా తన గుణగణానుకూలంగా ప్రవర్తిస్తున్నదా లేదా? అనేది సమస్య.

శ్రీనాధమూర్తికి కాశీ మణికర్ణికా ఘట్టంలో కామవాంఛ మాయమయింది. అతనికి ప్రపంచం శకుంతల రూపంలో సుందరంగా కనిపిస్తుంది. తరువాత మానస సరోవర ప్రాంతాల్లో సౌందర్య భావనలోని "దివ్యత్వాన్ని"

దర్శిస్తాడు. స్వామీజి బోధలవల్ల పునీతుడవుతాడు. సౌందర్య స్థాయీ భేదాలను తెలుసుకుంటాడు. స్త్రీ సౌందర్యం, ప్రకృతి సౌందర్యం, మానవ జీవిత సౌందర్యం, ఇవన్నీ సౌందర్యభావన రూపాలే. భౌతికాతీతమైన భగవంతుని లీలల్లో తన్మయత్వం చెందడం "దివ్యమైన" సౌందర్య దర్శనం. భౌతిక, మానసిక, ఆధ్యాత్మ భావాలను సమన్వయం చేయటం త్యాగతి విధి. ఎవరికీ స్వతంత్రం లేదని, కుటుంబ, సంఘ, జాతి, దేశాలంకెలతో శ్రుతి సామరస్యం కలిగి ఉండడమే స్వేచ్ఛ అని విశ్వసించిన వ్యక్తి త్యాగతి. స్త్రీలు కోరే స్వేచ్ఛ ఎందులో?, అని ప్రశ్నించిన మగవాడు అతడు. 'ధర్మం మరచిన స్వేచ్ఛ కోరుచే తలపబోకుడీ భువి కాంతల్, ధర్మంపోతే నీతులు పోతే తరుణుల మనస్సులు గతులు తప్పితే. 'అని పారిజాత పుష్పం వేషం వేసిన సోఫీ పాడిన గీత రచయిత త్యాగతి. భౌతిక మానసిక ఆధ్యాత్మికములు సంగమించిన వాంఛ మాత్రమే మనిషి మరువ లేనిదని నిశాపతికి బోధించిన ప్రజ్ఞాశాలి. మరి ఎందుకు హేమను వివాహమాడాలని సంకల్పించి నట్లు? స్వామీజీ ఆజ్ఞను పాటించుటయా లేక శకుంతల రూపం ఆమెలో చూస్తున్నందు వలననా, లేక, బుద్ధి చాపల్యమా! హేమకు తనకూ భావ సామీప్యత లేదు. సిద్ధాంత సన్నిహితత్వంలేదు. తాత్విక సమాదృశత్వం అసలే లేదు. దివ్యత్వం అసలే లేదు. ఈ పాత్రను సరిగా చిత్రించ లేదు బాపిరాజు గారు.

ఇక హేమ విషయం. మొదటి నుండీ విప్లవ భావాలున్న స్త్రీ. స్త్రీ పురుషులు సమానులని ధృఢంగా నమ్మిన మహిళ. ఇరువురూ అంగీకరించిన స్త్రీ పురుష సంబంధం నీతిదూరం కాదని వాదించే నారి. ఆడది అందరి మగ వెధవల ప్రక్కలో పడుకునే స్వేచ్ఛ ఎవరికి కావాలని గుడిపాటి వెంకటచలం గారిని విమర్శించిన వ్యక్తి. ''తన్ను తానుగా ప్రేమించని ప్రేమను తాను మాత్రం ఎలా అందుకోగలడు''. అని త్యాగతి విషయంగా ప్రశ్నించుకున్న జిజ్ఞాసి. అభిమాన క్రోధంతో ఉడికిపోయిన మానిసి. ప్రేమించని తీర్థ మిత్రునితో రహస్యంగా పారిపోవడం పిరికితనమని భావించిన ధైర్యస్తురాలు. 'స్వచ్ఛ స్వేచ్ఛావాదం' తనదని ప్రకటించుకున్న ధీరురాలు. 'మగవాళ్ళకు అంతరంతరాలలో మేమే గొప్ప అనే అహంభావం ఉన్నదని, వారి రాతల్లో, చేతల్లో, మాటల్లో, పాటల్లో వ్యక్తమవుతున్నదని' వాదించిన మనిషి. ఈనాటి

స్త్రీలు పడే యమయాతనలను, వారున్న పరిస్థితిని చూచి మండిపడే ఉవిద. "స్త్రీలు బిడ్డలను కనేయంత్రాలా? అడది వంటచేసిపెట్టే రుక్మిణీ కుక్కరా?" పనిచేసే దాసీదా? పురుషుని కామతృప్తి తీర్చే భోగినా?" అనే ప్రశ్నలకు సమాధానాలు చెప్పుకోవాలని తపించిన తరుణి. ఆడదాని ప్రథమకర్తవ్యం ఉద్యోగం అని నమ్మిన అతివ. అలాంటి వ్యక్తి ఒక్క సంఘటనతో తల్లడిల్లి పోయి శీలం అంటే లైంగిక శీలమనే భావానికి లొంగిపోయి, "బావా! నేను నా దేహాన్ని ఏ మాత్రం పంకిలం చేసుకోలేదు" అని వాపోయే పరిస్థితికి ఎందుకు ఎలా దిగజారింది? భౌతికంగా స్వేచ్ఛ ఎవరికి లేదనీ, 'కట్టుబాటులు, నియమాలు నిజమైన స్వేచ్ఛ' అనీ, ఎలా భావించింది? కేవలం జాత్యభివృద్ధికోసం త్యాగతిని వివాహమాడ నిశ్చయించిందా? త్యాగతిని స్వామిగా, ఆత్మేశ్వరునిగా 'భర్తగా' ఎలా స్వీకరించి మోకరిల్లింది? దీనికి తగిన సమాధానం పుస్తకంలో దొరకదు. ఆమెను త్యాగతికి లొంగిపోయేలా రచయిత చేయాలనుకున్నాడు, చేశాడు. అంతే.

ఒకప్పుడు వ్యభిచారిగా సంచరించిన తీర్థమిత్రుడు హేమతో పరిచయం చేసుకున్నదాది "అనేక కామ దేవాలయాలను మరచిపోయాడు. అవి గ్రామదేవతలు. ఇది మధుర మీనాక్షీ దేవాలయం, తాను సుందరేశ్వరుణ్ణి అని కావ్యం అల్లుకున్నాడు." హేమసుందరి హెచ్చరించినప్పటినుంచి ఆమెతో అసభ్యంగా ప్రవర్తించినట్లు దాఖాలాలు లేవు. హేమ పిలిస్తేనే బొంబాయి ప్రయాణం కట్టాడు. మరి అతడు రాక్షసుడు ఎలా అయ్యాడు? విధురుడయి వ్యభిచరించిన త్యాగతి పవిత్రుడయి, భార్య ఉండి మరో స్త్రీని ఆరాధించే వ్యక్తి ఎలా అపవిత్రుడయ్యాడు. ఈ పాత్ర చిత్రణలో రచయిత లోపం చేశాడు.

రచయితకు మార్క్సిజం అంటే, ఎం. ఎన్. రాయ్ అంటే, "రాయిస్టు"లంటే ద్వేషం. తీర్థమిత్రుని రాక్షసుడని త్యాగతి చేత చెప్పిస్తాడు. తను తీర్థమిత్రుని బారినుండి హేమను రక్షించటానికి ఉద్భవించిన మహా పురుషుడని త్యాగతి భావిస్తాడు. రచయితకు మార్క్సిజం అవగాహన లేక పోయి ఉండాలి లేక ఏ'రాయిస్టు' మీదన్నో ఈర్ష్య, అసూయ, పగ ఉండి అలా రాసి ఉండాలి. ఏదయినా ఒక సిద్ధాంతాన్ని సరిగా చిత్రించి దానిని విమర్శిం చటం విజ్ఞుల లక్షణం.

ఈ నవలను కష్టపడి చదువ వలసిన పనిలేదు. అదే మనలను చదివిస్తుంది. అదే బాపిరాజుగారి ప్రజ్ఞ.



# మానవవాద దార్శనికుడు: ఎం.ఎన్.రాయ్

ఇది రాయ్ శతదినోత్సవ సంవత్సరం. ఈ సందర్భంగా రాయ్ ప్రవచించిన తాత్విక, రాజకీయ, ఆర్థిక, సాంఘిక నిర్వచనాల వల్ల కాని భావ విప్లవం వల్ల కాని మార్పు వస్తుందా? ఆ సిద్ధాంతాలకు శాశ్వతత్వం ఉందాఅని ప్రశ్నించే వారికి రాయ్‌ని గురించి చర్చించటం అవసరం.

"సత్యాన్వేషణే నా జీవిత ధ్యేయం. మానవుని అభివృద్ధికి మానవుడే గీటురాయి" అన్నాడు ఆధునిక తత్వవేత్తలలో ప్రముఖుడైన ఎం. ఎన్. రాయ్ సామాన్య పూజారి కుటుంబంలో పుట్టి అసాధారణ హేతువాది అయినాడు. అతి సామాన్య విద్యతో అత్యున్నత పండితుడై 14 భాషలు నేర్చి నూరు గ్రంథాలు వ్రాసి మేటి విద్యావేత్త అయినాడు. "టెర్రరిస్టు"గా జీవితాన్ని ప్రారంభించి జాతీయ వాదిగా మారి సోషలిష్టు, కమ్యూనిష్టు దశలు దాటి హ్యూమనిష్టుగా పరిఢవిల్లాడు. వ్యక్తి స్వేచ్ఛను గుర్తించనిది, వ్యక్తిని కేంద్రంగా స్వీకరించని సిద్ధాంతం నిలువదన్న జ్ఞానాన్ని పొందిన తత్వవేత్త. దేశదేశాల అనుభూతుల సమ్మిశ్రమంతో అఖండ ప్రతిభను పొందిన దిట్ట. ప్రవచించిన ఆదర్శానికి ప్రతీక. నమ్మిన సిద్ధాంత ప్రచారంలో రాజీలేని శూరుడు. అలాంటి రాయ్ ప్రవచించిన సార్వకాలిక సిద్ధాంతాలు మూడు. స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ, విశ్వమానవత. వీటి అనుభూతిని శాస్త్రీయదృక్పథం, హేతువాదం, తాత్విక చింతనల ద్వారా పొందాలని నిర్వచించాడు.

మానవ విలువలకు విలువ నిచ్చేదే శిసలైన మానవ వాదం. ఇది మానవ సంబంధాలన్నింటిలోనూ ప్రజాస్వామిక విధానాన్ని నిర్దేశిస్తుంది. వైజ్ఞానిక ప్రాతిపదికపై జీవిత విధానం ఆధారపడాలని నిర్దేశిస్తుంది. సహకార ఆర్థిక విధానాన్ని ప్రతిపాదిస్తుంది. వర్గ దృష్టి, జాతీయదృష్టి, సమిష్టి భావ కల్పనలను వ్యతిరేకిస్తుంది. మతం, దైవం, సంప్రదాయాలను అంగీకరించదు. వ్యక్తికి, వ్యక్తికి మధ్య తేడాలను నిరసిస్తుంది. వర్గ, వర్ణ, జాతి, లింగ భేదాలు లేని

సమసమాజాన్ని కాంక్షిస్తుంది హ్యూమనిజం. సామాజిక చైతన్యానికి "రినైజాన్సు" వుద్యమమే శరణ్యమని బోధిస్తుంది. స్వేచ్ఛాన్వేషణ, మానవస్వేచ్ఛ మానవ అభ్యుదయానికి మార్గాలని ఉద్ఘాటిస్తుంది నవ్యమానవ వాదం.

బుద్ధికి, తర్కానికి, అనుభవానికి నిలువని నీతిని, రీతిని నమ్మడు హేతువాదం. సంప్రదాయ ప్రమాణ గ్రంధాలు, ప్రవచనాలు, మతం, దైవాలపై నమ్మిక హేతువాదులకు వుండదు, హేతువాదం, వ్యక్తివాదం, మానవవాదంల కలయికే నవ్య మానవవాదం. హేతువాది అయిన మానవుడు నీతివాదిగా మసగలడు, "Man is Moral Because he is Rational" అన్నాడు రాయ్. హేతువాద మనేది ఒక సిద్ధాంత విషయం కాదు. అదొక ఆలోచనా విధానం మాత్రమే. వివేచనా శక్తిని మానవ వ్యవహారాలకు అన్వయింప చేయాలనేదే దీని ధ్యేయం.

జాతీయ విప్లవమే కాక సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో ఆధునిక భావాలు రంగరించాడు రాయ్. పెట్టుబడిదారీ విధానానికి, జాతీయ కరణకు మధ్యే మార్గంగా, సహకార ఆర్థిక విధానాన్ని సూచించాడు. పార్టీ వ్యవస్థకు వ్యతిరేకంగా పార్టీరహిత ప్రజాస్వామ్యాన్ని (రాడికల్ డెమాక్రసీ) వాంఛించాడు. 1940లో స్థాపించిన పార్టీని రద్దుచేసి రాడికల్ హ్యూమనిస్టు ఉద్యమాన్ని స్థాపించాడు. అంతర్జాతీయ హ్యూమనిస్టుగా ప్రఖ్యాతి గడించి ప్రముఖ స్థానాన్ని చేరాడు. మతాభిమానం, వర్గదృష్టి, జాతిద్వేషం, స్వార్థం' అవిద్య, అజ్ఞానం లేక పరిశుద్ధుడైన వ్యక్తే సమాజసేవకు అర్హుడని వక్కాణించాడు.

"భారతనారి" ఆదర్శం అనే పుస్తకంలో స్త్రీల దైన్యావస్థను, పురుష దురహంకారాన్ని దుయ్యబట్టాడు. స్త్రీ పురుష హోదాలో తేడాలు లేవని, ఏ పరిధిలోనూ అసమానత్వం క్షమార్హం కాదని హూంకరించాడు. స్త్రీల మానసిక దాస్య విముక్తికి పురుషుల తోడ్పాటు అవసరమని ప్రవచించాడు. ఎంతకాలం స్త్రీలు బానిసత్వంలో మ్రగ్గి వుంటారో అంతకాలం పురుషులు కూడా బందీలుగానే మిగిలి పోతారు; అంతేకాదు కుటుంబమూ, సమాజం,

దేశం కూడా ప్రగతి పథంలో పయనించ లేదు" అని ఎలుగెత్తి చాటాడు. స్త్రీ విముక్తికి దేశ ప్రగతికి కుటుంబనియంత్రణ ఆవశ్యక కర్తవ్యమని మార్గాంతరం చూపాడు. సాంఘికంగా వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య హెచ్చు తగ్గులు వుండరాదని వాదించాడు. అందరికీ సమానావకాశాలు వుండాలని ఘోషించాడు. స్త్రీ జాతి పురోగమనం, స్త్రీల చైతన్యమే దేశభ్యుదయ మంటూ జాతి, కుల మత, భాషా ప్రాంతీయ రుగ్మతలు తక్షణం నశించాలని వక్కాణించాడు.

కత్తి కఠారులతో ప్రారంభమైన విప్లవ భావం తాత్విక విప్లవంతో అంతమయింది. ఆజన్మాంతం విధివిరామంలేని జిజ్ఞాసతో, సత్యాన్వేషణతో సాగిన మహాప్రస్థానమే రాయ్ జీవితం. సత్యాన్వేషణతో శాస్త్రీయ దృక్పథంతో, ఆధునిక భావాలతో, తాత్విక చింతనతో కడ దాకా పురోగమిస్తూనే వున్నాడు. 40 వేల పుటలు లోకానికి అందించాడు. అలా వ్రాస్తూనే తే 25-1-54దిన మరణించాడు. విధి విరామం లేని జీవితాన్ని గడిపి సమాజానికి నూతన తాత్విక చింతనను ప్రసాదించి లోకోత్తరుడయినాడు

సోక్రటీస్, మార్క్సుల వలెనే రాయ్ మరణించిన 20 సంవత్సరాలకు అతని పరోక్షంలో అభినందిస్తున్నారు. తన భావాలను పలువురు ఆమోదించుట కంటే వ్యక్తిని అభినందించేది మరొకటి లేదు. ఆ భావ పరంపరల్లోరూపొందిన రాడికలు సమస్యను సమూల పరిశోధన చేయటంలో రాయ్‌చే హ్యూమనిస్టులు ప్రభావితులైనారు. రాయ్‌ని 20వ శతాబ్దారంభపు ఆసియా జాతీయోద్యమ విప్లవ చైతన్య మూర్తి అన్నారు. అలా చరిత్ర పుటల్లో ఉత్తమ స్థానాన్ని అందుకొన్న రాయ్ సిద్ధంతాలు ఈ నాటి సమాజానికి అవశ్య ఆదరణీయాలు అనక తప్పదు.



# కవిరాజు సాహిత్యంలో స్త్రీ

త్రిపురనేని తెలుగునాట భావ విప్లవ వ్యాప్తికి తోడ్పడిన మహాపురుషుడు. భావ దాస్యానికి అలవాటుపడ్డ ఆంధ్రప్రజలకు ప్రశ్నించటం పరమ ధర్మమని బోధించిన బుద్ధిజీవి. హిందూ సమాజ వైపరీత్యాలను వెలికితీసి వాటి పుట్టు పూర్వోత్తరాలను త్రవ్వి చూపిన పరిశోధకుడు. సమాజంలోని అసమానత్వాలను అక్రమాలను చూచి మానసిక క్లేశాన్ని అనుభవించిన మనిషి. స్త్రీలపట్ల జరుగుతున్న అన్యాయాలను వెలికి తీసిన న్యాయవాది.

త్రిపురనేని కొన్ని స్త్రీ పాత్రల గురించి **తమ గ్రంథాలలో వ్రా**శారు. **సీత**, పల్నాటి చరిత్రలోని నాగసాని, వేనుని **తల్లి** సునీథాదేవి, విభీషణుని భార్య సరమ అలాంటివారు. వారు ఈ పాత్రలను పోషించిన తీరును గమనిస్తే కొంతవరకు వారికి స్త్రీల పట్లగల అవగాహన మనకు **తెలుస్తుం**ది. చివరకు వాటి విషయమై 'శతకాలు' అనే గ్రంథంలో మరికొంత వివరంగా చెప్పటం జరిగింది.

సీత హిందవులు పవిత్ర ఆదర్శమూర్తిగా భావించే శ్రీరామచంద్రుని భార్య. రావణ వధానంతరం అగ్ని ప్రవేశంచేసి తన శీలాన్ని పదిమంది ముందు నిరూపించుకోవలసిన గతి ఆమెకు కలుగుతుంది. అంతేగాక ఒక కుసంస్కారి వేసిన అపవాదులకు భయపడి భర్త ఆమెను అడవికి పంపుతాడు. పునస్సమాగమ సందర్భంగా తనతో కాపురం చేయమని భర్త ఆమెను అభ్యర్థిస్తే ఆమె తన జననియైన భూదేవిని ప్రార్థించి ఆమె వద్దకు చేరుతుంది. ఈ కథ ఉత్తర రామ చరితంలో ఉంది. ప్రజారంజకుడైన రాజు తన అభిప్రాయాలను విస్మరించి కేవలం ప్రజల భయ సందేహాలను పారద్రోలటానికి ఎలా భార్యను కూడా కష్టాలు పాలుచేయవలసి వస్తుందో ఆదర్శజీవి శ్రీరామచంద్రుడు నిరూపించాడని కొందరు రాముని చర్యలను సమర్థించారు. మరి కొందరు సీతను పొగిడారు. కాని ఇక్కడ సమస్య వేరు. రాముడు తన భార్య శీలాన్ని నిజంగా విశ్వసించాడా లేదా అన్నది ప్రశ్నకాదు. నిజంగా భార్యపై నమ్మకం ఉన్నా లేకపోయినా భార్యను సంశయ దృష్టితో చూచినట్లు

కనుపించాడు. ఇక్కడ మూడు అంశాలు గమనార్హాలు అవుతాయి. ఒకటి రాచరికము మీద రాముని కి గల మోజు. సతిని ఇక్కట్ల పాలుచేసేదానికన్న రాజ్యాన్ని వదులుకోవచ్చు కదా! అలాచేయలేదు. రెండవది, రాముని పురుషాధిక్యతా భావం. మూడవది, సీత ఆత్మాభిమానం. మూటిలో చివర దానిని త్రిపురనేని పేర్కొని విశదీకరించాడు.

"సంశయించు భర్త సాహచర్యము జేయ
సాధ్యపడునే యెట్టి సాధ్వికైన
సీత భూమి జొచ్చె శ్రీరామచంద్రుని
గూడి యుండలేక కుప్పుస్వామి."[1]

ఈ పద్యములో పురుషజాతి దుర్గుణ ఖండన కనిపిస్తుంది. సతిని విశ్వసించలేని భర్తను ఈసడించడం ద్యోతకమవుతున్నది. సీత ఆత్మాభిమాన చర్యను ప్రశంసించటం కానవస్తుంది.

వేనుడు నిర్మించ పూనిన సమసమాజంలో అన్యాయాలకు, అక్రమాలకు అసమానత్వానికి స్త్రీలు కూడా లోను కారాదు. అతనికి రాజమాత సునీథాదేవి అండ దండలు, ఆశీస్సులు ఉన్నాయి. ఆమె అతని ఆశయాలను బలపరచింది. అతని ప్రయత్నాలలో అతనికి ఉత్సాహం ఇచ్చింది; ఉత్తేజపరచింది. అతని శ్రేయస్సును కాంక్షించింది. అతని పక్షాన మేరునగ ధీరయై నిలచింది. 'ఖూనీ' నాటకంలో రెండోరంగంలో, నాలుగవ అంకంలో ఆ వీరమాత మనకు సాక్షాత్కరిస్తుంది. ప్రతికక్షుల ప్రయత్నాలను వమ్ము చేయమని, ప్రతీకార చర్యను చేపట్టమని సమసమాజ నిర్మాణం నిర్విఘ్నంగా సాగించమని ఆమె రాజుకు సలహా చెప్తుంది. రాజునకు సలహాదారులు కరువగుదురా! కాని ఆ కర్తవ్య నిర్వహణకు రాజమాత పాత్రను సృష్టించటంలో, పోషించటంలో స్త్రీజాతి యెడ తన గౌరవాన్ని చాటుకున్నాడు త్రిపురనేని. అంతేగాక స్త్రీకి సమయోచిత పాత్ర లేనిది ఏవిప్లవమూ ఫలించదనే పచ్చి నిజాన్ని త్రిపురనేని ఇలా ప్రకటించాడని తోస్తుంది.

ద్రావిడ సార్వభౌముడైన రావణుని చర్యలను సమర్థిస్తూ యదార్థ రామాయణ స్వరూపాన్ని 'సూతపురాణం' లో త్రిపురనేని మనకు ఎరుక పరచాడు.

విభీషణుండు సరమ యను నామెను వివాహమాడెను. ఈమె గంధర్వ స్త్రీ అందుచే ద్రావిడ జాత్యభిమానము ఇసుమంతయు లేక భర్తను, రాజద్రోహానిం జేసి: ఆ ఇంటిగుట్టు విరోధులకు తెలియజేసి సర్వ నాశనము జేసెను...... తన భర్తను రాజును జేయుట యొక్కటియే యామె మనస్సు నందుంచుకొని మిగుల హేయమగు కార్యమును జేసెను.[3] త్రిపురనేని ద్రావిడ జాతి పక్షపాతి. ద్రావిడ సామ్రాట్టు చేత పీడింపబడిన గంధర్వ జాతి స్త్రీకి ద్రావిడ జాతిపై ఎందుకు అభిమానం ఉండాలో దురూహ్యం. జాతి సిద్ధాంతాన్ని ప్రతిపాదించినపుడు లేక దాని ప్రాతిపదికను పరోక్షంగానైనా సమర్థిస్తున్నపుడు భిన్నజాతి వ్యక్తినుండి స్వామి భక్తిని ఆశించటం త్రిపురనేని వారికి తగని పని. తన కుమార్తె త్రిజట సాయంతో, తన నేర్పరితనంతో సీతతో కుమ్మక్కై, రావణ విరోధి వర్గంలో భర్తను చేర్చి కృతకృత్యురాలైన సరమ అభినిందనీయ.

మరో స్త్రీ పాత్ర "పల్నాటి వీర చరిత్ర" లోని నాగమసాని; నాయకురాలిగా ప్రసిద్ధి పొందిన స్త్రీ. రాజనీతి దురంధర. మేధాసంపత్తిగల మహిళ. ఎత్తుకు పై యెత్తును వేయగల దిట్ట. ఆమె మనకు త్రిపురనేని వారి 'కురుక్షేత్రం' లో దర్శనమిస్తుంది. ఆమె వీరశైవ మతావలంబి. ఆమె తెచ్చిన పల్నాటి యుద్ధము ఆమె స్వార్థం కోసమై కల్పింప బడలేదు. అది కేవలము మత యుద్ధము. వీరశైవానికి, వీరవైష్ణవానికి మధ్య జరిగిన సంఘర్షణ. నాగసాని ప్రతిభను ఉగ్గడిస్తూ త్రిపురనేని వాక్యాలను గమనిద్దాం. "తెలివి తేటల యందు దక్క సాగసానియు, ద్రౌపదియు జెన్నుద్దులే. ఒక కమ్మచ్చున దీసిన తీగలే. ఎచ్చులొచ్చులు లేవు. అసహనము, దురపేక్ష దీర్ఘవైరము, దుస్సహ ప్రతీకార వాంఛ మొదలగు గుణములన్నియు నిర్వురకు సరిసమానమే. కాని సామ్యమంతటితో ముగిసినది. ద్రౌపది పౌరుషము కలడు గట్టిన పాంచాల క్షత్రియ స్త్రీ; రాజనీతి మెరుంగని యప్రాజ్ఞురాలు. నాగసాని యట్లుకాదు. తేరి చూడరాని మగటిమి రూపొందిన తెలుగు బిడ్డ. ఎత్తునకు పై యెత్తు వేయ నేర్చిన జాణ. మనుజుల పుర్రెలతో చదరంగ మాడనేర్చిన చతురుపాయ ప్రయోగ విధాన వేత్త. దేశకాల పాత్రల నెరింగి కార్యము సాధించుకొను దిట్ట."[4] మరోచోట ఇలా అంటాడు త్రిపురనేని. ఉంచుకున్న

వి ర్తను పూవులలో పెట్టి పూజించి రణవ్యాపారం సాగించినది నాగసాని. ఇంకొక తావున కోడిపోరులో ఆమె ప్రవర్తనను ఖండించాడు త్రిపురనేని. ఇదంతా చదువరికి ఏమి తెలియ జేస్తుంది? కవిరాజు యొక్క ఆంధ్రాభిమానం, సమర్థురాలైన స్త్రీ యొక్క సామర్థ్య ప్రశంస, ఋజుమార్గ ప్రవర్తనపై ఆయనకు గల గౌరవ భావం వ్యక్తమవుతున్నాయి. రాచ కార్యాలలో కూడా పురుషులతో సమదీటుగా స్త్రీలు పాల్గొనాలని త్రిపురనేని ఆకాంక్ష. అందుకనే లంకాపుర వర్ణన సదర్భంగా పురుషులతో సమానముగా "బోటులు సర్వకళాభిరామలై గురువుల వద్ద విద్దెలను గోరిక నేర్చుటె గాక ఘోర సంగరమున నస్త్ర శాస్త్రముల గైకొని యేయుట నేర్చి యందరున్ గఁగజికన్ స్వరాష్ట్రమును గాచెడి పూనిక.... ...[7]" అని చిత్రణ చేశార.

రామస్వామి గారు స్త్రీజన పక్షపాతి. పురుషుల దుర్నీతి, ఎండ కట్టారు. స్త్రీలకు విద్య చెప్పించకుండా, పైగా విద్యా వ్యాసంగం విషయంగా వారిపై ఆంక్షలు విధించి, వారి అవిద్యకు వారిని నిందించటాన్ని నిరసించారు.

"చదువు చెప్పకుండ జడురాంద్రగా జేసి
స్త్రీల దిట్టిపోయ జెల్లుచుండె
దోసమెవరి యందు దొరలాడు చుండునో
చెప్ప బోవరెవరు కుప్ప స్వామి!

కొంత మంది సమాజంలోని పతిత స్త్రీలను నిందిస్తూ తమ పవిత్రతను నిరూపించుకో చూస్తారు వారిని గురించి ప్రస్తావిస్తూ.

"వారకాంతల బడదిట్టు వారు గలరు
విటులు కవ్వింప కుండిన వేశ్యలెట్లు
చెలచు వారలో పురుషులు జెప్పబోరు
కుచ్చితులు గారె వీరెల్ల కుప్పస్వామి"

అని ఆక్షేపించారు. స్త్రీలకు విద్య ఎంత అవసరమో వారు వివరించారు.

"చదువు లేని జాయ సల్లాపముల కన్న
చదువుకొన్న జాయ చలము మేలు;

పీను పిందుగా వినవచ్చు నొకమాట
సెప్పు దప్పదైన గుప్పుస్వామి."[10]

"భార్య చదువు పతికి బనికి వచ్చుచు నుండు
గొడుకు చదువుకన్న గొంత వఱకు
చదువు కొన్న భార్య సంసారమును దిద్ది
కొనుచు బతికి గూర్చు కుప్పుస్వామి"[11]

పురుషుల అధికార మదాంధత చేత తమ భార్యలను ఎట్లు కష్ట పెట్టురో కవిరాజు పిశదీకరించారు.

"పురుషుడెన్న రోగములచేత
బీడింప బడుచున్న సతికి వరవుడంచు
నల్ప ధర్మమంట జగతిలోనిది యెటో
చెప్పబోరు జనులు కుప్పుస్వామి"

"కుష్టురోగి యైన గుతుల్సిదైనను
మగువ తీర్పు వలయు మగని కోర్కె
సతికి హక్కులేదె స్వశరీరమును బ్రోచి
కొనగ సుంతయైన గుప్పుస్వామి"[12]

మొదట పద్యములో స్త్రీ యొక్క దాస్యాన్ని రెండవ పద్యములో స్త్రీకి తన శరీరము పైగల హక్కును కవిరాజు ప్రస్తావించాడు. "రోగములచేత" అన్నపుడు సుఖరోగముల చేత అని అర్థము. భర్త తిరుగుబోతైనా భార్య అతనికి దాస్యం చేయాలా అని ప్రశ్నించాడు. స్త్రీ యొక్క సమ్మతి లేనిదే ఆమె శరీరం ఇచ్చే సుఖాన్ని ఎవరూ-భర్త కూడా—ఆశించరాదని దాని భావం. దాంపత్య జీవితంలో కూడా ఆమె ఇష్టం లేనిదే భర్త ఆమె పొందును కోరరాదని దాని అర్థం. అయితే భర్త అనారోగ్యముతో, సుఖరోగాలతో బాధ పడుతుంటే మాత్రమేనా లేక అన్ని పరిస్థితులలోనా అనేది మీమాంస. తన ఆరోగ్యానికి భంగం లేకుండా భర్త కామ వాంఛను ముస్లిం స్త్రీ తీర్చాలని వారి "లా" చెప్తున్నది. ఈ విషయం న్యాయవాది అయిన త్రిపురనేనికి తెలుసు

కదా! అందువలన అలా చెప్పి ఉంటారు. కాగా ఈనాటి స్త్రీలు ఇంతకన్నా ఒకడుగు ముందుకు వేశారు. వైవాహిక బంధంలో కూడా స్త్రీ సమ్మతి లేనిదే ఆమె శరీరాన్ని భర్త వాడుకోరాదని, తన శరీరము మీద ఆమెకే సంపూర్ణ హక్కులున్నాయని స్త్రీల వాదన. దీని కోసము ఆధునిక స్త్రీలు పోరాడుతున్నారు. ఈనాటి 'లా' ప్రకారం వివాహం చేసుకున్నందువల్లనే తన శరీరంపై భార్య భర్తకు హక్కు కలుగజేసిందట! ఇది పాశ్చాత్య ప్రాచ్య దేశాలలో అన్ని సమాజాలలో, ఉన్న నీతి. పురుష ప్రాధాన్యత గల సమాజపు నీతి. దీనిని కవిరాజు ఖండించాడు అని భావించగలమా! ఈ శతకం 1930లో వ్రాయబడినదని మనం జ్ఞాపకం పెట్టుకుంటే ఇంత విప్లవ భావాన్ని ఆ రోజుల్లోనే ఆయన చెప్పాడని భావించలేము. ఈ అభిప్రాయానికి రావడానికి వారి ఇతర భావాలు కూడా ఉపకరిస్తాయి.

వివాహ బంధానికి రామస్వామి గారు ఎంతో విలువ ఇచ్చారు. అందుకే "వివాహవిధి" ప్రకటించారు. స్వర్గాన్ని అవహేళన చేస్తూ.

"ఇండ్లు యున్నవి కాని పెండిండ్లు లేవు
ఆండ్రు యున్నారు కాని యిల్లాండ్రు లేరు".[13]

అన్నారు,
మరోచోట శూర్పణఖను ప్రశంసిస్తూ ఇలా వ్రాశారు.

"ఆశ్రమంబులలో గృహస్థాశ్రమంబె
యఖిల జన శిరోధార్యమునంచు దలచి
శూర్పణఖ ప్రొద్దులను పుచ్చు సంగతి గోరి".[14]

పెండ్లిలో సతీపతులు సమానమని చెప్పారు.

"పెండ్లియందు నాతనికేల పెత్తనంబు ?
కష్ట సుఖములందులి పాలి కాపులగుట
బెండ్లి కూతురు కొమరుండు పెండ్లిజేసి
కొనగ వలెను గాని నిజముగా గుప్పస్వామి".[15]

వధూ వరులు ఒకరినొకరు ఎన్నుకోవాలనే భావం తోస్తున్నది. అంటే తల్లి దండ్రుల మాటపై కాక ప్రేమపై ఆధారపడు వివాహాలు కావాలని వారు సూచించినట్లు కనిపిస్తున్నది.

"చదువుకొన్న భార్య సహధర్మ చారిణి
యగుటకన్న మంత్రియగుట కోరు
జగతి మంత్రి గొప్ప సహధర్మచారిణి
గొప్ప తెలిసి మెలగు గుప్ప స్వామి".16

అనడం ఎంతో ఔచిత్యంతో కూడుకొన్నది. భార్య యొక్క మంత్రిత్వ శక్తిని పొగిడారు. సహధర్మచారిణీ వృత్తాన్ని అనవసరమని త్రోసి వేశారు. కాని ఈ భావానికి విరుద్ధంగా కొన్ని పద్యాలున్నాయి. వాటిని గమనిద్దాము.

"అణిగిమణిగి యుండు నటువంటి కులకాంత
భయము భక్తి గలుగు ప్రియ సుతుండు
సంభవించు వాని జన్మంబు నిజముగా
గొప్ప సార్ధకంబు గుప్ప స్వామి".17
(వక్కాణింపు మాది)

పై పద్యములో సహధర్మచారిణిత్వం అంత గొప్పది కాదన్నారు. దీంట్లో అణిగి మణిగి యుండే భార్య కావాలంటున్నారు. ఈ భావాలలో అయోమయాన్ని ఆయన తప్పించుకోలేదు.

ఈ క్రింది రెండు పద్యాలు కూడా పరిశీలింపదగినవి.

"తనదు నిలువు గాపాడుకొనగ లేని
యతివ భర్త గౌరవము గాపాడగలదె?
యట్టి యామెతో కాపుర మహరహంబు
కూర్చుచుండు గష్టంబుల కుప్పస్వామి".18

"ఆడదాని యాలువంత రాచిన మీద
నెట్టి వంశమందు బుట్టియున్న

క్రుడ్డి గవ్వకైన గొఱగాక పోవునా
యొప్పు లేని జగతి గుప్పుస్వామి"19

(వక్కాణింపు మాది)

ఈలువు అంటే పతివ్రతాత్వం, పతి యెడల విశ్వాసం అని చెప్పకుంటే బాధ లేదు. అలాకాక పతిని గురించి ప్రవర్తించటం అనేది అర్థమయితే తగాదా వస్తుంది. స్త్రీకి వ్యక్తిత్వముంది. భార్య అయినంత మాత్రాన ఆమె దానిని కోల్పోదు. రూఢ్యర్థంగా పాతివ్రత్యం అంటే పతియొక్క ఇష్టా ఇష్టాలను ఆజ్ఞలను ఆదేశాలను పాటించమనే అర్థమే వస్తుంది. అలాగంటే అభ్యంతరమే కదా! స్త్రీ శీలాన్ని గూర్చి కొంత గట్టిగా చెప్పటం జరిగింది.

"వయసు చెల్లుచున్నంత లావణ్యముడుగు
నుడుగనిది యొక్క శీలంబు పడతి కెప్పు
డుడుగ కుండంగ వర్ధిల్లుచుండు గాన గుణము
లేని చెలువ యేల గుప్పు స్వామి''

(వక్కాణింపు మాది)

శీలము స్త్రీ పురుషులకు ఇద్దరికీ అవశ్యక మైనదే. కాగా హిందూ సంస్కృతిలో స్త్రీల శీలముపై మరింత శ్రద్ధ చూపబడింది. వాడుకలో శీలము అంటే లైంగిక సంబంధమైన నీతి. అని అర్థం వస్తున్నది. నిజానికి సత్య వాక్య నిరతి, చిత్తశుద్ధి, వివేచనా శక్తి, నైతిక భావం, సానుభూతి, దయ, దాక్షిణ్యము, సహృదయత్వం ఇవన్నీ కలిస్తే 'శీలం' అవుతుంది. పామరులు వాడే అర్థంలో ప్రత్యేకంగా స్త్రీలను పేర్కొని త్రిపురనేని వారు చెప్పటం పొరపాటే. "ధీమతామపిహి'' అన్నారు. గొప్పవాళ్ళు మేధావులూ కూడా చాలా సార్లు పొరపాట్లు చేస్తుంటారు. గొప్పవారి పొరపాట్లు బ్రహ్మాండమైన తప్పిదాలు అవుతాయి. త్రిపురనేని అంతటివాడు ఈ విషయంలో ఇంత పొరపాటు పడడానికి కారణమేమై ఉంటుంది? బహుశ : ఈ పద్యాలన్నీ ఒకసారి వ్రాసినవి కావా? ఆయన వ్యక్తిత్వం, పాండిత్యం, బుద్ధి, నైశిత్యం బాగా పెరగక ముందు చెప్పినవా ఈ పద్యాలు? మరి ఆయన జీవిత గ్రంథకర్త గొర్రెపాటి వెంకట సుబ్బయ్య గారి లెక్కప్రకారం కుప్పుస్వామి శతకం

1930లో వ్రాయబడినది. 21 "ఖూని" 1935 నాటిది, భగవద్గీత 1940 నాటిది. ఆయన 1943లో మరణించారు. అంటే 1930లో త్రిపురనేని ఆస్తికుడే. బ్రాహ్మణ మత వ్యతిరేకి గాని మత వ్యతిరేకి కాదు. ఇంచు మించుగా అన్ని మతాలు పురుషాధిక్యతను సమర్ధించాయి; బలపరిచాయి. కనుక త్రిపురనేని కూడా ఆ ఆస్తిక భావాల విషకౌగిలి నుండి బయట పడలేక పోయినందున ఇలాంటి పాత కాలపు మాటల 'ఈలువు' (పాతివ్రత్యం), 'శీలం' వాడారు వాటిని సమర్ధిస్తూ పద్యాలు వ్రాశారు. కాల ప్రభావం, మత ప్రాబల్యం ఈ రెంటి నుండి అంతగొప్ప త్రిపురనేని కూడా బయటికి రాలేక పోయాడు కనుకనే పెండ్లి విషయం చెప్తూ ఆయన ఇలా అన్నాడు.

"మేనమామ పోలిక మేనత్త చాలిక
యనెడు సంప్రదాయ మధిగమించి
పెండ్లి చేయునపుడు పెద్దగా యోచించి
కులము నెదుక వలయు గుప్పుస్వామి"

(వక్కాణింపు మాది)

కులము అనే దానికి పదకొండు అర్ధాలు ఉన్నాయి. వంశము, వర్ణము అనేది ఉ॥ బ్రాహ్మణ కులము (2) గోత్రము (సంతతిని సూచించేది). తతిమ్మావి మనకు ప్రస్తుతం అనవసరం. కవిరాజు ఏ అర్ధములో కులము అనే పదాన్ని వాడారో అనేది గ్రహించాలి. "కులము" వర్ణానికి వాడి యుండరు. ఎందుకంటే శూద్రులని పిలువబడేవారు ఒక వర్ణము వారే కావి అనేక కులాలకు చెందిన వారు. బ్రాహ్మణేతర ఉద్యమంలో ఉన్నా రామస్వామిగారు 1941 వరకు కులాంతర వివాహాలను ప్రోత్సహించినట్లు సమాచారము లేదు. కాగా కులము అంటే వంశమనే అర్ధంలో వాడి ఉంటారు. వంశాన్ని చూచి పూర్వం పిల్లనిచ్చే వారు, తెచ్చుకునేవారు. కనుక కవి రాజు కూడా అలాగే భావించి ఉంటాడు. ఇక్కడ ప్రశ్న ఏమంటే 'కులము' అనకుండా 'గుణము' అనే పదాన్ని వాడి ఉండవలసినది గుణ ప్రాధాన్యతకు నొక్కి పెట్ట లేదనిబాధ. అయితేకొన్ని చేదు నిజాలను మనం విస్మరించరాదు. 1917లో బ్రాహ్మణేతతర మహాసభకు అధ్యక్షత వహించాడు. 1922లో కమ్మ మహాజన సభాధ్యక్షతం 1930లో కుప్పుస్వామి శతకం. 1935లో ఖూనీ. ఇవి ఆయన జీవితంలోని ఘట్టాల

వరుస క్రమం. కనుక ఆయన భావాలు 1930 నాటికి ఇంకా పరిణతి పొందలేదు. కవిరాజును గురించి గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారు వ్రాసిన వాక్యాలు ప్రథమంగా జాతీయ బ్రాహ్మణేతర పక్షము, తదుపరి కాంగ్రెసు ఉద్యమము మరల జస్టిసు పార్టీ, ఇట్లు వైవిధ్యమే లేక వైరుధ్యం కూడా ఆయన నడవడిలో కాన వచ్చును. "ఆయన జీవితము అందరివలె ఆస్తికుడుగా కులాభిమానముగా ప్రారంభమయినది. చివరకు మానవతా వాదిగా, నాస్తికుడుగా పరిణామము చెందిన వాడాయన."[23]

వెంకట సుబ్బయ్యగారి విమర్శనాయుత వాక్యాలు అంగీకార యోగ్యాలు. పరిణామం ప్రకృతి సిద్ధం. కవిరాజు పెరిగాడు; ఎదిగాడు. త్రిపురనేని రామస్వామి చౌదరి స్థానలో త్రిపురనేని వెలిశాడు. స్త్రీ జనంపై పూర్వం ఉన్న అపోహలు తొలగి పోయి ఉంటాయి. ఆయనే మరల ఆ శతకాన్ని తిరిగి వ్రాయడం తటస్థించి ఉంటే పైన ఉటంకించిన అయిదు పద్యాలను ఆయన తిరగ వ్రాసి ఉండేవారు, లేక వ్యాఖ్యానించే వారు.

మహిళోద్యమాన్ని, స్త్రీ విమోచనను ఆయన సంపూర్ణంగా సమగ్రంగా ఊహించ లేక పోయినా, స్త్రీ లలో ప్రశ్నించే మనస్తత్వం వెలువడటానికి అవసరమైన భావ బీజాలు నాటాడు.

## రిఫరెన్సులు


1) శతకాలు-గీతాలు (1971) పుట 20
2) "ఖూనీ" నాల్గపరంగం-పుట 60
3) సూతపురాణం తృతీయాశ్వాసము (సూతాశ్రమ ప్రచురణ పుట 39)
4) భగవద్గీత (1971 ఆగష్టు) తొలిపలుకులు-పుట 18
5) ,, ,, 19
6) ,, ,, 19
7) సూత పురాణం తృతీయాశ్వాసము (సూతాశ్రమ గ్రంథమాల) పుట 84
8) శతాకాలు-గీతాలు (1971) పుట 13
9) ,, ,, 12

10) శతకాలు-గీతాలు (1971) 9
11) ,, ,, 10
12) ,, ,,
13) సూతపురాణం ద్వితీయాశ్వాసము—పుట 43
14) ,, తృతీయాశ్వాసము ,, 88
15) శతకాలు-గీతాలు పుట 20
16) ,, ,, 9
17) ,, ,, 9
18) ,, ,, 10
19) ,, ,, 20
20) ,, ,, 21
21) 'కవిరాజు జీవితము-సాహిత్యం' గొట్టిపాటి వేంకట సుబ్బయ్య పుట 314
22) శతకాలు-గీతాలు (1971) పుట 22
23) 'కవిరాజు జీవితం-సాహిత్యం.' (గొట్టిపాటి వేంకట సుబ్బయ్య)పుట 314



# కుల వ్యవస్థను తొలగించడమెలా ?

ఆ రోజు మా అమ్మమ్మ నా నాలిక మీద దర్భ కాల్చి పెట్టింది. భయంతో మొర్రో అంటున్న నన్ను "శూద్రులు చేసిన మిఠాయి ఎందుకు తిన్నావు బుద్ధిలేదా? నిన్ను శుద్ధి చేయాలంటే, లేక ప్రక్షాళన చేయాలంటే ఇదే మార్గం. అనుభవించు" అంటూ మొట్టికాయ మొట్టింది. ఆ మర్నాడు సాయంత్రం వీధి అరుగుల మీద కూర్చున్న మమ్మల్ని చూచి కాలి చెప్పులు చంకలో పెట్టుకొని "అమ్మగారూ! లోపలికెళ్ళండమ్మా! చెప్పరానివాడు వస్తున్నాడమ్మా!" అంటూ దూరంగా నిలబడ్డాడు మాచేను చేసే పెంచలయ్య. అదేమిటి "అమ్మమ్మా! అలా దూరంగా నిలబడి అలా అడుగుతాడు" అన్నా లోక జ్ఞానం తెలియని నేను. నువ్వు నోరు మూసుకుని లోపలికి పదా! వాడు అంటరానివాడే! మనం మైలపడి పోతామే అన్నది అమ్మమ్మ. మరి మన పొలంలో పని చేస్తాడు కదా ఆ వడ్లు తింటే, ఆ కూరలు వండితే మనం చెప్పరాని వాళ్ళం కామా! అని ఎదురు ప్రశ్న వేశా. వాడి పూర్వజన్మ పాప కర్మ వల్ల వాడు అలా పుట్టాడు; మనం చేసిన పుణ్యంవల్ల ఇలా పుట్టాం అని నన్ను వొప్పించింది. సరే కాని "అమ్మమ్మా! అసలు కర్మ అంటే ఏమిటి? అన్నా" అతి ధీమాగా "నీవెర్రి మొర్రి ప్రశ్నలుమాని చెప్పినట్లు వింటావా లేదా? వస పోసిన వాగుడు కాయలా తయారయ్యావు లేలే" అంటూ రెక్కపట్టి గుంజి లోపలికి లాక్కెళ్ళింది. అలా అరుగులమీద తిష్టవేసిన వాళ్ళంతా వెళ్ళాక తలొంచుకొని తలపాగాతో చొక్కాలేని పెంచలయ్య వెళ్ళిపొయ్యాడు.

అది 60 సంవత్సరములనాటి చరిత్ర. నాలుగు వర్ణాలతో మొదలై అందులో పుట్టి, పెరిగి, వేలకువేలై విస్తరించి మహావృక్షాలైన రోజులివి. శూద్రులు హీనకులస్తులనీ, మాల మాదిగలని వారిని నీచంగా చూస్తూ అడ్డమైన చాకిరీ చేయిస్తూ కేవలం గంజిత్రాగి బ్రతకటానికి తగిన భత్యం ఇచ్చి గొడ్డు

చాకిరీ చేయించుకొనే వారు అగ్రహారీకులు, అగ్రకులాలవారు. వారిని తమ ఇళ్ళకు దూరంగా గుడిశెల్లో ఉంచేవారు. చెఱువులు, బావులు వారు తాకరాదు. గుళ్ళలోకి పవిత్ర స్థళాల్లోకి వారు వెళ్ళరాదు. పంక్తి భోజనానికి వారు అనర్హులు. వారితో పెద్ద కులాల వారికి పెళ్ళిళ్ళు పూర్తిగా నిషేధం. విద్య అనే దానికి వారు నూరామడల దూరంలో ఉండేవారు. ఏచిన్న తప్పు చేసినా పెద్ద పెద్ద శిక్షలు వేశేవారు. దాని లక్షణమే శంబుక వధ-శూద్రులు, స్త్రీలు తపస్సు చేయరాదు; వేదాధ్యయనం నిషిద్ధం అనేవి ఆనాటి కట్టుదిట్టాలు, ఆచారాలు. చట్టాలెన్ని వచ్చినా, సంస్కరణలెన్ని జరిగినా ఈనాటికీ ఉపన్యాసాలలో, సాహిత్యంలో తప్ప ఆచరణలో మృగ్యమనేదానికి తార్కాణాలు బోలెడన్ని ఉన్నాయి.

నీవు ఏ మార్గాన పయనిస్తున్నా ఈ కులమనే భూతం నిన్ను పట్టి బంధించి పీడిస్తూనే ఉంటుంది. ఉదా॥ ఈనాడు మానవుడు విశ్వమానవుడైనాడు. కాని కుల సంకెళ్ళను త్రెంచుకోలేని నిర్వీర్యుడయ్యాడు. అమెరికాకు చదువుకని, ఉద్యోగానికని వెడతారు కాని పెళ్ళిదగ్గరకొచ్చేటప్పటికి ఇండియా రావాలి; అందులోనూ ఆంధ్రప్రదేశం, అందులోనూ కులం, వంశం, తెగ, భాషా ప్రాంతీయత ఇన్ని చూచి పెళ్ళాడతానంటారు. నేటి మానవుడు చంద్రుడి నెత్తి నెక్కినా, సైన్సు శాఖోపశాఖలుగా విస్తరించినా, విజ్ఞానశాస్త్రం విశ్వ కవాటాలను ఛేదించినా మనం ఇంకాపాత ఆచారాలను, ధర్మశాస్త్రాలను పాటిస్తూనే, విశ్వశిస్తూనే ఉన్నాం. మనలో మానసిక మార్పురానిదే చట్టాలుకాని, ప్రజాభిప్రాయంకాని, నంస్కరణలు కానీ ఫలవంతం కానే కావు.

"టైమ్సు ఆఫ్ ఇండియా" 1948 వార్త. ఇండోరు జిల్లాలో, గ్రామ గ్రామాల్లో నివసించే హరిజనులకు బ్రాహ్మణులు, కరణాలు, మునసబులు ఒక హుకుం జారీచేశారు. మీరు తలపాగాలు. అందమైన ధోవతులు ధరించరాదు. మీ స్త్రీలు నగలు, అందమైన బట్టలు కట్టుకోరాదు. మీరు మా ఆడవాళ్ళ ప్రసవ సమయాల్లో సేవలు చేయాలి. మా ఇళ్ళలోని చావు కబురు మా బంధువులకు చేర్చాలి. మా ఊరేగింపుకు మేళాలు వాయించాలి. ఇచ్చిన కూలీతో తృప్తిపడి మాకు వెట్టిచాకిరీ చెయ్యాలి. వీటిని ప్రతిఘటిస్తే మా గ్రామాన్ని విడిచి మీరు

వెళ్ళిపోవాలి. బాలురను సర్కారు బడికి పంపరాదని కూడా తాఖీదులు పంపారు. స్త్రీలు, శూద్రులు తపస్సు చేయరాదని; వేదాలు ఉచ్ఛరించరాదనేది ఆర్ష సంప్రదాయం. అందువల్లే ఏకలవ్యుడు విద్యార్జనకు అనర్హుడైనాడు. మహావీరుడైన కర్ణుడు సూత పుత్రుడనే నెపంతో అడుగడుగునా అవమానాల పాలైనాడు. అలా వారి శక్తి సామర్థ్యాలు నిర్వీర్యమై కేవలం జీవచ్ఛవాల్లా జీవించేవారు.

పరిశ్రమలు లేని రోజుల్లో వ్యవసాయమే జీవనాధారమైనప్పుడు, ఉమ్మడి కుటుంబాలున్న రోజుల్లో తండ్రి వృత్తినే కొడుకులు చేపట్టేవారు. 'గుణకర్మ విభాగహ' అన్నట్లు వృత్తులతో ప్రారంభమైన కుల వ్యవస్థ ఈనాడు పుట్టుకతో మిళితమై పోవటం శోచనీయం. ఈనాడు అందరూ అన్ని వృత్తులూ చేస్తున్నారు. ప్లీడరు పనిని ప్లీడరు కులం అని, డాక్టరు పనిని డాక్టరు కులం అని, ఇంజనీర్ల కులమని అంటే ఎంత హాస్యాస్పదంగా ఉంటుందో ఊహిస్తే మనకే అవగత మవుతుంది.

భారత రాజ్యాంగములో లింగభేదం, జాతిభేదం, వర్ణ భేదం లేవని వాటిని పాటించిన వారు శిక్షార్హులనీ స్పష్టికరించారు. మాల మాదిగలని నిరసించినా, తాకరాదన్నా బావుల్లో చెరువుల్లో నీళ్ళు ముట్టరాదన్నా, దేవాలయ ప్రవేశం కూడా లేదన్నా, నీచపద ప్రయోగాలు చేసినా, అలాంటి వాటిని ప్రోత్సహించినా 'సివిల్ రైట్సు యాక్టు' ప్రకారం శిక్షార్హులు అన్నది చట్టం. కాని ఆచరణలో అవి మృగ్యమవుతున్నాయి. ఈ దేశాన్ని మతం నిలువునా చీలిస్తే కులం అడ్డంగా చీల్చి ముక్క చెక్కలుగా చేసి నరికి పారేసింది. 5 వేలకుపైగా కులాలున్న మనదేశంలో ఐక్యత, సమానత్వం, భద్రత ఎలా సిద్ధిస్తాయి అనే, ప్రశ్నకు సమాధానం దొరకదు.

సహపంక్తి భోజనాలు ఇంకా సర్వ సాధారణం కాకపోవటం' ముఖ్యంగా వివాహాలు అన్యకులాలతో నిషిద్ధంగా పరిణమించడంజరుగుతున్నది. కులానికి మూడు లక్షణాలు ఉన్నాయి. ఒకటి, తాకరాదు. రెండవది సహపంక్తి భోజనాలు లేవు. మూడవది, కులాంతర వివాహాలు పనికి రావు. ప్రేమించుకున్న వారిని చంపనైనా చంపుతారు కాని పెళ్ళాడ నివ్వకపోవటం

జరుగుతున్నది. విద్యా ఉద్యోగాల నిమిత్తం ఇతర దేశాలలో నివసిస్తున్న వారు సైతం వివాహం అనే సరికి భారతదేశం వచ్చి ఇక్కడ స్వరాష్ట్రంలో స్వకులంలోనే పెళ్ళాడి మళ్ళీ ఆదేశాలు పోతున్నారు. ఇది కుల వ్యవస్థకు పునాది అయింది. ఈ వివాహ విధుల్లో మార్పు వస్తే తప్ప కుల వ్యవస్థ పునాది బ్రద్దలు కానే కాదు.

కుల వ్యవస్థ పుట్టు పూర్వోత్తరాలు ఆశ్చర్యంగానూ, అసంబద్ధంగానూ ఉన్నాయి. గుణకర్మ విభాగాలను బట్టి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే నాలుగుజాతులను తానే సృష్టించానని భగవద్గీతలో ఉంది. బ్రాహ్మణ కులం అత్యంత శ్రేష్టమైనది కనుక క్షత్రియ, వైశ్య,శూద్రులు వారినిపూజించి సేవ చేసి తరించాలని మనుధర్మ శాస్త్రం నిర్దేశించింది. ఒక నేరం చేసినప్పుడు క్షత్రియుల కన్నా వైశ్యులకు ,వారి కన్నా శూద్రులకు శిక్షలు హెచ్చుగా విధించాలని, అదే నేరం బ్రాహ్మడు చేస్తే ఏ శిక్ష లేకపోగా నిందార్హము కానేరదు, అనేవి స్మృతుల నిండా బోలెడన్ని వున్నాయి. ఇంత కన్నా నైచ్యము, ఘోరమైన విషయం మరొకటి లేదు. ఈ నాలుగు వర్ణాలకు చెందని వారిని పంచములని పేర్కొని వారిని ఊరికి దూరముగా ఉంచి, అవమానపరిచి, క్రూర హింసలపాలు చేసేవారు. వారికి ఏ రక్షణా ఉండేది కాదు. ఇలా వేల సంవత్సరాలు గడిచాయి. సంస్కర్తలు, రాజ్యాంగ నిర్ణేతలు,అస్పృశ్య వ్యవస్థను నిషేధించాలని రాజ్యాంగంలో పొందు పరచారు.

సనాతన ఆచారాలు, సంప్రదాయాలు మనకు అనాదిగా శిరోధార్యాలు. కనుక చట్టాలను అధిగమించి సామాజిక రీతులకే విలువ ఇస్తున్న దేశం మనది. కులాల సంఖ్య ఇంకా పెరుగుతోందే కాని తగ్గటం లేదు. హరిజనుల్లో మళ్ళీ 536 శాఖలు ఉన్నాయని జగజ్జీవనరాం అన్నారు. అయితే క్రైస్తవ ముస్లిం మతాల్లో మాత్రం శాస్త్ర రీత్యా కులాలు లేవు.

ఎంత కాలం కర్మ పునర్జన్మల సిద్ధాంతాలను మనం విశ్వసిస్తామో అంతకాలం కులవ్యవస్థ నశించదు. కారణం "నీ పూర్వ జన్మ కర్మఫలమే నిన్ను ఈ హీనజాతి కులంలో పుట్టించింది. ఈనాడు నీవు నీవిధిని విస్మరిస్తే

మరోజన్మ (పునర్జన్మ) లో మళ్ళీ ఈ పాపాన్ని అనుభవిస్తావు" అంటూ వారిని హడలకొడతారు. అజ్ఞానం వల్ల, అవిద్య వల్ల ఆ సూక్తులు విని తమ కర్మ ఫలం అంతే అనుకుంటూ నోరు విప్పరు వారు. ఇది పూర్వ చరిత్రే కాదు. నేటి పరిస్థితీ ఇంకా దరిదాపు అలాగే వుంది.

కులమత దురభిమానాలు, మూఢాచారాలు స్త్రీలలో మిక్కుటంగా ఉన్నాయి. ఎక్కడ అజ్ఞానం, అవిద్య అధికంగా ఉంటాయో అక్కడ కుల వ్యవస్థ ఘనీభవించి నాట్యం చేస్తుంది. స్త్రీలు ఈ కుల వ్యవస్థను పెంచి పోషించి వృద్ధి చేయటానికి మొదటిగా కారణభూతులయితే పురుషులు ఆ విష భాండాగారాన్ని పడకుండా భూజస్కంధాలపై నిలిపి. సర్వ విధాలా వ్యాపిచేశారు. ఈనాడు ఇది రాజకీయ వాతావరణాన్ని సైతం కలుషితం చేసింది. కులాల వారికి పదవులు ఇవ్వడం మొదటి మెట్టయింది. యథారాజా తథా ప్రజ అన్నట్టు ఇది సామాజిక వాతావరణంలో అంటే ఎలక్షన్లలో ప్రవేశించిందల్లా నేడు ఉన్నత విద్యా కేంద్రాలయిన యూనివర్సిటీలలో, కాలేజీ కమిటీలలో ఒకటేమిటి సర్వరంగాల్లో "ఇందు గలదందు లేదన్నట్లు" సర్వాంతర్యామియై కూర్చుంది.

ఈ విషజాడ్యాన్ని కూకటి వ్రేళ్ళతో త్రెంచాలంటే భారీ ఎత్తున సర్వ రంగాల్లో సర్వులు కలిసి కృషి చేయాలి. సంకల్పం, పట్టుదల ఉంటే సాధించలేని దంటూ ఉండదు. ఆచారం, ఆహారం, ఆర్థికం, పరిసరాలు, భాషా ప్రాంతీయతలు కులాంతర వివాహాలకు అడ్డుగోడలు కారాదు. అదొక సాకు మాత్రమే. చాలా మంది ఆహార, ఆచారాల తేడాల వల్ల, కులాల మధ్య వివాహాలు పొసగకపోగా కుటుంబ వ్యవస్థ దెబ్బతింటుందంటారు. కనుక దీక్షకి కొన్ని నిర్దుష్టమైన నిర్ణయాలు చేసి ఆచరించాలి.

## II

స్వేచ్ఛా ప్రియులు కుల తత్వాన్ని ఖండిస్తున్నారు. మనిషి చుట్టూ వదో గిరి గీసుకున్న వాళ్ళు కులాన్ని ఈసడిస్తారు. దేశం వర్గం, జాతి, ఇలాంటి వలయాలను నిర్మించుకొని అవి కులం కన్నా

శ్రేష్ట మయినవని భావించే వారు కులాన్ని తెగడడంలో ఆశ్చర్యం లేదు. భాషా, సంస్కృతి, ప్రాంతం అనే భావాలకు మరింత ఎక్కువగా విలువ ఇచ్చే వారు కూడా కులతత్వాన్ని ఖండిస్తున్నారు ఇంతకన్నా మరో విశేషమేమంటే కుల ప్రాతిపదిక మీద తమ తమ వర్గాలకు, మతాలకు, తెగలకు ప్రత్యేక సదుపాయాలను కోరే వారు కూడా కుల తత్వాన్ని నిరసిస్తున్నారు. కనుక విషయాన్ని ఈ పద్ధతిలో చర్చించడానికి ఎక్కువ మంది విముఖంగా లేరని విదితనువుతున్నది.

అయితే కులతత్వాన్ని విమర్శించే క్రమంలోనే తేడాలు అభిప్రాయ భేదాలు,మార్గాంతరాలు వస్తున్నాయి. ఎవరి నమ్మకాలకు ప్రమాదం కలిగితే వారు అసమ్మతిని తెలుపుతారు. అంటే పరిష్కార మార్గాలు వారి వారి విశ్వాసాలకు అనువుగా ఉండాలని అందరూ కోరుకుంటారు. వివిధ మానవ సముదాయాలకు వివిధ విశ్వాసాలు ఉంటున్నందువల్ల వారు సూచించే పంథాలలో బహుళత్వమూ వైవిధ్యమూ కన్పించటం సహజం. మరో అంశం ఈ సందర్భంలో గమనార్హం. కులవ్యవస్థను ఏమైనాసరి కూకటి వ్రేళ్ళతో పెకలించాలనుకునే వారు సూచించే పద్ధతులు ఒక రకంగా ఉంటాయి. అలా కాక ఏదో తగు మాత్రంగా మార్పులు చేద్దామనుకునే ఆలోచనా విధానం మరోలాగుంటుంది. అంటే రెండవ వారి దృక్పథంలో కులతత్వం వస్తుథా చెడ్డది కాదని, దాని పరిణామంలో దుర్లక్షణాలు పుట్టాయని లేక దుష్ఫలితాలు వచ్చాయనే భావం దర్శనమిస్తున్నది.

కులవ్యవస్థను తొలగించాలంటే మున్ముందుగా కులవ్యవస్థ ఎలా పుట్టింది, ఎలా పెరిగింది, దానిని బలపరిచే అంశాలేమిటి అనే వాటిపై సమగ్ర అవగాహన ఉండాలి. వ్యాధి పుట్టటానికి కారణాలను అన్వేషించకుండా వ్యాధి లక్షణాలకు వైద్యం తలచటం వివేకవంతమైన చర్యకాదు. అలా చేయపూనితే ఫలితం రాకపోగా సమస్య మరింత జటిల మవుతుంది.

అసలు కులతత్వ స్వరూపం అలనాడు ఎలా ఉన్నది. ఈనాడు ఎలా ఉన్నది. మార్పులేమైనా ఉన్నాయా లేక దాని మౌలిక స్వభావంలో మార్పులు రాలేదా అనేది కూడా చర్చనీయాంశమవుతుంది.

ఒక కులం వారు మరో కులం వారితో కలసి భోజనం చేయకపోవడం కులవ్యవస్థ లక్షణమని కొందరి అభిప్రాయం. అలాకాక ఒక కులం వారికి మరోకులం వారికి పిల్లలను ఇచ్చిపుచ్చుకోవడం లేక పోవడం కులతత్వ స్వభావమని మరికొందరి ఆలోచన. ఇతర కులాల వారిని వేరుగా చూడటం, తమ కులం వారిని ఆత్మ బంధువులుగా పరిగణించడం కులాల ఉనికికి అసలు గుర్తని ఇంకా కొందరి ఊహ. పై చెప్పినవన్నీ మౌలికం కాదని కొందరు విమర్శకుల భావం. ఇలా పలు భావాలు ప్రదర్శిత మవుతున్నాయి. కుల తత్వం బాగా ప్రబలంగా ఉన్న రోజుల్లో కూడా సహ భోజనాలున్నాయి కాని సహపంక్తి భోజనాలు లేవు. కాలం మారుతున్నది. పారిశ్రామికీకరణ సాగు తున్నది. పట్టణాలు పెరుగుతున్నాయి. పెక్కు కులాలవారు ఒకే ప్రాంతంలో ఒకే పేటలో, ఒకే బస్తీలో ప్రక్క ప్రక్కన నివసిస్తున్నారు. దాంతో సహ భోజనాలు సహపంక్తి భోజనాలుగా మారుతున్నాయి. మున్ముందుగా యువకు లలో బయలు దేరిన ఈ మార్పు నడి వయస్సులోకి ముదుసళ్ళలోకి కూడా ప్రాకుతున్నది. కాగా కులవ్యవస్థ నడుము విరగడం లేదు. పైగా గట్టి పడు తున్నది. కాబట్టి సహపంక్తి భోజన నిషేధం ఒకనాడు కులతత్వ లక్షణమైనా ఈనాడు దానికి ఉనికి పోతున్నది. అందుచేత దానిని మౌలిక లక్షణంగా పేర్కొనటం సమంజసం కాదు.

మానవ జీవితంలో ప్రధాన ఘట్టాలు జననం, వివాహం మరణం. పుట్టుక, చావు వీటి విషయంలో కులం అంతగా మనకు కొట్టవచ్చినట్లు కన్పించదు. పెండ్లి విషయానికి వచ్చేటప్పటికి ఎవరి కులంలో వారు పెండ్లి చేసుకోవాలని ఆరాట పడుతుంటారు. పెద్ద పెద్ద మాటలు చెప్పే వారు. విప్లవ ఆవశ్యకతను గురించి గొప్ప గొప్ప ఉపన్యాసాలు చేసేవారు, బండ్ల కొద్దీ గ్రంధాలను వ్రాసేవారు, వేల సంఖ్యలో వ్యాసాలను ప్రజానీకం పైకి వదిలేవారు, వారు పీరన నేల తొంబది శాతం ప్రజలు తాము ప్రకటించిన కుల విధ్వంస అభిప్రాయాలనే ఆచరణలో గౌరవించరు. అనేక కుంటిసాకులు చెప్తారు. తమ ఆచరణను సమర్ధించుకో చూస్తారు. ఇది కేవలం వ్యక్తుల బలహీనత

ప్రదర్శన కాదు. అసలు సమస్యపై సమగ్ర అవగాహన లేకపోయినందువలననే ఇలా సంభవిస్తున్నది.

ఒకప్పుడు కులాలు వేరయినా, ఆచారాలు ఎవరివి వారికున్నా, గ్రామాలలో వివిధ కులాలవారు తదితరులను వరుసలు పెట్టి తాతా, మామా, బాబాయి అని పిలుచుకునే వారు. ఎక్కువ మంది కులవ్యవస్థ న్యాయసమ్మతమని భావించారు కనుక వారికి ఈ ఆప్యాయత ఏర్పడింది. కాలం మారుతున్నది. కులతత్వపు కోరలు బహిర్గతమవుతున్నాయి. దాని దౌష్ట్యానికి లోనయిన వారు ఆ వ్యవస్థ వల్ల లాభించేవారి చర్యలను సహించలేక పోయారు. మోసాన్ని తెలుసుకున్నారు. తమ అజ్ఞానానికి తమను తామే నిందించుకున్నారు. దాంతో ఆప్యాయతలు, అభిమానాలు హుష్ కాకి అయిపోయాయి. దీనికి ఎవరూ చింతించనవసరంలేదు. ఈ మార్పు అనివార్యం; అవసరం. అయితే ఈమార్పు కుల పిశాచపు అసలు రూపాన్ని పూర్తిగా ప్రజలందరికి ఎరుక పరచాలి కదా! అలా జరగటంలేదు. ఇది శోచనీయం. రాచరిక వ్యవస్థ బదా బదలయింది. ఒకనాడు పరిపాలకులు వర్ణాశ్రమధర్మ రక్షణకు, కుల ధర్మ పరిరక్షణకు కంకణం కట్టుకొని కృషి చేశారు. ఈ అక్రమ జీవిత విధానాన్ని సమర్థించే శాస్త్రాలను, పురాణాలను, ఇతిహాసాలను, సాహిత్యాన్ని ఆదరించి, పెంచి, పోషించారు. ప్రజల చిత్త వృత్తులను కులానికి అనుకూలంగా మలచటంలో కృతకృత్యులయ్యారు. రాజులు కాలగర్భంలో కలసిపోయ్యారు. అగ్రవర్ణాలని చెప్పుకున్నవారి ఆర్థిక స్థితి గతులు రాజకీయ హోదా తారుమారయ్యాయి. ఈ మార్పు శుభ సూచకం. అభిలషణీయం. అయితే ఈ పరిణామం వల్ల రావలసిన ఫలితం రాలేదు. కొన్ని కులాలవారు పై కులాలుగా ప్రకటించుకున్న వారిని ఎదిరించి ప్రయోజనాలను పొందారు కాని తమ పోరాట మనస్తత్వాన్ని తదితరులకు అందజేయలేదు. అంతటితో ఆగక 'సంస్కృతీ కరణ' పేరుతో అగ్రవర్ణాలని చెప్పుకునే వారి దుర్లక్షణాలను పుణికి పుచ్చుకోసాగారు. వర్ణ వ్యవస్థలో, కుల వ్యవస్థలో తమ అంతస్తును పెంచుకున్నారేకాని ఆ దుష్ట సమాజ నిర్మూలనకు పూనుకోవటం లేదు. పైగా తమకన్న క్రింది కులాలని చెప్పి తలిమ్మా వారిపై హింస, దౌర్జన్యం సాగించ మొదలు పెట్టారు. ఇది ఆవాంఛనీయమైన పరిణామం. ఈనిచ్చెన మెట్ల

సమాజంలో, ఈహైందవ వ్యవస్థలో తాము మరో నాలుగు మెట్లు ఎక్కారు కాని అసలు ఈ నిచ్చెన మెట్ల సమాజపు మౌలిక తత్వాన్ని కాదనటం లేదు. ఇది ఈ నాటి దుర్భర పరిస్థితి.

ప్రజాస్వామ్యం వెల్లి విరుస్తున్నదని అంటున్నాం. అభావాన్ని సరిగా సక్రమంగా అర్థంచేసుకోలేక వోట్ల వరకు ఎన్నికల వరకు పరిమితం చేశాము. పదవులు ప్రజాప్రాతినిధ్య సంస్థలు ప్రముఖ స్థానం అక్రమించాయి. దీంతో, అంటే ఇలాంటి రాజకీయ మనుగడలో కులతత్వానికి పునరుజ్జీవనం కల్గింది. సమాజపు వనరులు అందరికి చాలినంగా లేవు పైగా అందరికి అందు బాటులోకి రావటం లేదు. దాంతో సదుపాయాల కోసం త్రొక్కిసలాట బయలు దేరింది. ముఠాలు, సంఘాలుగా ప్రజానీకం ఎగబడ్డారు. క్రొత్తవర్గాలను సృష్టించుకొనే దానికన్నా పాతకాలపు కులవ్యవస్థను వాడుకోవటం తేలిక అని తోచింది. దాంతో కుల సంఘాలకు కాళ్ళొచ్చాయి. అగ్రవర్ణాల దుర్మార్గాన్ని ఎదుర్కోవడానికి, తమచిన్న చిన్న సమాజాలలో సామాజిక దురాచారాలను రూపు మాపుకోవటానికి ఒకనాడు ఏరపడిన బ్రహ్మణేతర సంఘాలు, కుల సంఘాలు ఈనాడు బలం పుచ్చుకున్నాయి. వాటిలో చేరటానికి, వాటిని బలపరచ టానికి, పోషించటానికి. వాటివల్ల ప్రయోజనాలను పొందటానికి రాజకీయ వాదులు సిగ్గుపడటం లేదు. ఇలా కులవ్యవస్థ ఈనాడు బలపడుతున్నది. ఇది విషాద కర పరిమాణం.

వర్తమానాన్ని గురించి చర్చించుకున్నాం. దీని వలన తగు గుణపాఠా లను నేర్చుకోవాలనే సంకల్పం ఉదయిస్తేనే ఆలోచన ఫలిస్తుంది. నివారణో పాయాలను ఆలోచించే ముందు కులతత్వ పుట్టుకకు కారణ భూతమైన అంశా లను గుర్తించాలి. వర్ణధర్మం కులధర్మానికి తల్లితండ్రుల లాంటిది. హిందూ సంఘంలో వర్ణవ్యవస్థ లేక పోతే కులం పుట్టి వుండేది కాదు. మొదట్లో ఆరు లలో మూడు వర్ణాలతో - బ్రహ్మ క్షత్రియ వైశ్యులతో - ప్రారంభమయి తరు వాత నాలుగు వర్ణాలను ఏర్పరుచుకుని — అంటే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్ర వర్ణాలను - తరువాత పంచమ వర్ణాన్ని దళితులను - చేర్చింది హిదూం

సంఘం. వర్ణం రంగుమీద పుట్టిందని కొందరు, గుణ ప్రధానమని మరికొం దరు, వృత్తిపై ఆధార పడిందని మరికొందరు వాదోపవాదాలు చేశారు. ఏదైనా వర్ణాలు అలా నిలవలేదు. ఎన్ని ఆంక్షలు విధించినా వర్ణ సాంకర్యం తప్పలేదు. దాంతో మరికొన్ని ప్రజా సముదాయాలు ఉద్భవించాయి, వారికి కుల నిర్దేశం చేశారు అనాటి 'మేధావులు'. మరల ఆ సముదాయాలకు చెందిన వ్యక్తుల మధ్య వివాహ విహారాలు చెలరేగాయి. కులాలు పుట్టుకొచ్చాయి. ఇది ఒక ఆలోచనాధోరణి. ఆదిమ వాసులలో కొండజాతుల తెగలు ఉండేవి. అవే కులాలుగా స్థిర పడినయి. ఇది మరొక భావ వీచిక. రవాణా సౌకర్యాలు లేని ఆరోజుల్లో ఒకే వర్ణానికి చెందినవారు పలు ప్రాంతాలలో నివసించ వలసి వచ్చి రాక పోకలు లేక శాఖలవారుగా రూపొందారు. అగ్ర వర్ణాలుగా అభి వర్ణించుకునే వారిలో వీటిని కులాలు అనకుండా శాఖలన్నారు. కాని స్వభావం ఒకటే. ప్రజా సముదాయాలు చేసే పనిని బట్టి, అవలంభించే వృత్తిని బట్టి కులాలు పుట్టా యని మరొక ఊహ. మొత్తం మీద ఆలోచిస్తే, జాతి, రంగు, వృత్తి మొదట్లో వర్ణ వ్యవస్థకు కారణ భూతాలని అంగీకరించినా జాతి, వృత్తి, ప్రాంతం ఈ మూడు కులాల అవిర్భావానికి ముఖ్యాంశాలని తేలుతుంది.

ఇలా కొంత చారిత్రక అవగాహనను సంతరించుకున్న తదుపరి పరిష్కారమార్గాలమ అన్వేషించటం తేలికవుతుంది. బ్రాహ్మణ రక్తం, క్షత్రియ రక్త వైశ్యరక్తం శూద్ర రక్తం దళిత రక్తం అనేవి లేవు. అలాగే రెడ్డిరక్తం, కమ్మ రక్తం, కాపు రక్తం, యాదవ రక్తం అనేవిలేవు అందరి రక్తానికి ఉన్న వర్గీకరణ విధానం ఒకటే.ఇచ్చట ఒక మాట చెప్పుకోవాలి. సంకరం కాని జాతి ఈప్రపంచంలో ఈనాడు కన్పడదు. శుద్ధ జాతి, పరిశుద్ధ జాతి అనేది లేనే లేదు. ఇది చారిత్రక సత్యం. దీనిని తెలియజేసే విజ్ఞానాన్ని ప్రజానీకానికి అందుబాటులోకి తెస్తే కులతత్వపు నడ్డి సగం విరుగుతుంది.

వర్ణం, కులం ఆహార విభేదాల వల్ల పుట్ట లేదు, పెరగటం లేదు. ఆర్య రుషులు గోమాంస భక్షకులు. ఈనాటి కాశ్మీర బ్రాహ్మణులు మాంసాహారులు. బెంగాలీ బ్రాహ్మణులు మత్స్యాహారులు. దక్షిణాది బ్రాహ్మణులు శాకాహారులు.

వృత్తులు తారుమారయినాయి. బ్రాహ్మణులు సైన్యంలో చేరుతున్నారు. వ్యాపారాలు సాగిస్తున్నారు సేవా వృత్తిని చేపట్టారు. పాదరక్షలను విక్రయిస్తున్నారు. ఉంఛ వృత్తితో జీవయాత్ర సాగించేబ్రాహ్మణులు కరువవుతున్నారు. బ్రాహ్మణత్వానికి అడుగు ఊడింది. ఇదే జరిగింది. ఇతర వర్ణాలవారి విషయంగా కులాల పరంగా. కనుక వృత్తి మీద ఆధారపడి కులతత్వాన్ని ఎవరూ ఈనాడు సమర్థించలేరు. ఈ సామాజిక సత్యాన్ని ప్రజలకు ఎరుకపరిస్తే కొంతగా కొంత కులమౌఢ్యం నశిస్తుంది.

కులతత్వ వ్యాప్తి వల్ల దేశంలో ఐకమత్యం నశించిందని కొన్ని కులాల వారికి సామాజిక నిర్వహణలో ప్రమేయం లేకుండా పోయిందని, ప్రజలలో ఆధిక్యతా న్యూనతా భావాలు విస్తృతంగా నెలకొన్నాయని అందు వల్లనే మన దేశం విదేశీయుల దండయాత్రలను ఎదుర్కొనలేక పోయిందని, వందల వేల సంవత్సరాలు దాస్యంలో ప్రజలు మ్రగ్గారని చరిత్ర మనకు తెలుపుతున్నది. ఈ అంశాలను ప్రజల దృష్టికి తెస్తే వారు ఈ కులతత్వం వల్ల ఎంతగా నష్టపోయింది వారికి తెలుస్తుంది.

ప్రజలను కులాలు, మతాలు, భాషలు, ప్రాంతాలు, సంస్కృతి అనే అంశాల మీద చీల్చి వారి చుట్టూ గిరులుగీస్తే మానవ వ్యక్తి యొక్క స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నశిస్తాయి. వారిలో హెచ్చులొచ్చులు అవతరిస్తాయి. మానవులంతా సమానులు అనే భావన ఎగిరి పోతుంది. సమిష్టి అహంకారం పెరుగుతుంది. వైషమ్యాలు వెలుస్తాయి. తగాదాలు, కొట్లాటలు, హింసాకాండ, హత్యలు వారి మధ్య చోటు చేసుకుంటాయి. మనిషి కోసం సంఘం కాక, సంఘం కోసం మనిషి మనుగడ సాగించ వలసిన స్తితి వస్తుంది. చివరకు తన జీవిత భాగస్వామిని తాను ఎన్నుకోలేని నైచ్య పరిస్థితికి మనిషి దిగజారటం సంభవిస్తుంది. కాబట్టి ఈ సమిష్టి తత్వాన్ని ఎదిరించాలి అనేది ప్రధాన సందేశం కావాలి. అంత మాత్రాన ప్రతి వ్యక్తి అవినీతికరంగా తోటి మానవుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను హరిస్తూ బ్రతకమని అర్థం కాదు. తను స్వేచ్ఛను ఆశించేవాడు ఇతరుల స్వేచ్ఛను గుర్తించక తప్పదు. అప్పుడు సమన్వయ పూరకమూ, సామరస్యయుతమూ అయిన సమాజం వారికి అవసర

మవుతుంది. అలాంటి సమాజాన్ని మనుష్యులు ఏర్పరచుకుంటారు; నిర్వహిం చుకుంటారు. ఇంతకూ చెప్పేదేమంటే జాతి, దేశం, ప్రాంతం; వర్గం అనే సమిష్టి భావనలతో కులం అనే సమిష్టి భావనను వ్యతిరేకించలేము. మానవ వ్యక్తి మీద నొక్కి పెట్టే సిద్ధాంత బలంతోనే కుల భావనను ఎదుర్కోగలం.

మరోముఖ్యవిషయం ఇక్కడ ప్రస్తావించక తప్పదు. కులవ్యవస్థను సమాజం నుండి శీఘ్రంగా తొలిగించాలనే తొందరతో కొంతమంది మిత్రులు కొన్ని సూచనలు చేస్తున్నారు. పూర్వం హైందవ శాస్త్రకారులు సగోత్ర వివాహా లను, ప్రతిలోమ వివాహాలను నిషేధించారు. అది మనుష్యుల స్వేచ్ఛా స్వాతం త్ర్యాలకు అడ్డుగా నిలిచింది. కనుక ఆ నిషేధాలను వ్యతిరేకించారు అభ్యు దయవాదులు. ఇపుడు కులతత్వాన్ని పోగొట్టటానికి మరోమార్గం ఏమంటే కులాంతర్గత వివాహాలను శాసనం ద్వారా నిషేధించటం. అలాచేస్తే మనిషి స్వేచ్ఛకు భంగం కలుగదా అనే ప్రశ్న వస్తుంది. దానికి వారి సమాధానం ఏమంటే పూర్వం మనుష్యులకు 10 శాతం స్వేచ్ఛ ఉంటే వారి ప్రణాళిక ప్రకారం 90 శాతం స్వేచ్ఛ వస్తుందని. ఇది చూడటానికి, వినడానికి బాగానే, ఉంటుంది. కాని దీనికి అనేక అభ్యంతరాలు అవాంతరాలు ఉన్నాయి. ఒకటి, సిద్ధాంతపరమైనది. జీవిత భాగస్వామిని ఎంపిక చేసుకునే హక్కు భంగ పరు స్తుందనే కులాన్ని వ్యతిరేకిస్తున్నాం. ఇపుడు కుల నిర్మూలన పేరుతో అదే పని చేయటం మంచిది కాదు. అదీ గాక స్వేచ్ఛ అవిభాజ్యం. 10 శాతం స్వేచ్ఛ, 90 శాతం స్వేచ్ఛ అనే పదజాలం అర్థ రహితం. రెండవది, దృక్పథ బలహీ నత. ప్రజాభిప్రాయాన్ని సృష్టించకుండా శాసనం ద్వారా మాత్రమే సంస్క రణను ప్రవేశపెట్టామనుకోవటం పొరపాటు. మూడవది, అలాంటి శాసనం ఇప్పట్లో రాదు. 5వేల కులాల పైగా ఉన్న ఈ దేశంలో, కుల సంఘాలను ప్రముఖ రాజకీయవాదులు పెంచి పోషిస్తున్న ఈకాలంలో, కులం పేరుతో కొన్ని కుల సంఘాలవారు ప్రత్యేక సదుపాయాలను, సౌకర్యాలను రిజర్వేషనుల పేరుతో సాధించుకొని అనుభవిస్తున్న ఈరోజుల్లో ఇలాంటి శాసనాన్ని వారంతా వ్యతిరేకిస్తారు. నాలుగవది, ఈ ప్రతిపాదన హాస్యాస్పదం. పూర్వీకులు కులాన్ని తెలుసుకొని కులంలోనే పెండ్లాడమంటే వీరు కులాన్ని అడిగి తెలుసుకొని కులం వెలుపల మాత్రమే మరీ పెండ్లాడమంటున్నారు. పాతకాలపు కులతత్వం

బొమ్మ అయితే ఇది బొరుసు. పూర్వీకులు కులస్థులను అభిమానించమంటే, ఇపుడు, వీరు తమిమ్మా కులస్థులను మాత్రమే అభిమానించమంటున్నారు. గీటు రాయి ఇరువురి దృష్టిలోనూ కులమే. ఇక కుల భావన ఎలా పోతుంది? ఐదవది, కులాంతర వివాహాలు చేసుకున్న వారి సంతానం స్థగతేమిటి? వారికి కులం ఉండరాదు కదా! వారిని ఎవరు పెండ్లాడాలి? చివరమాట· ఇంతకూ ఫలాని అచ్చాయిని చేసుకోవాలని, ఫలాని అమ్మాయిని పెళ్ళాడాలని శాసనం ఎలా సమర్ధనీయం? ప్రేమకు ఈ "ప్లాను"లో అవకాశం లేకుండా పోతుంది. కులం, వ్యతిరేకార్ధంలో, దేవతయై కూర్చుంటుంది. ఇలాంటి తొందర పాటు ఆలోచనలు సమస్యను పరిష్కరించక పోగా ప్రమాదాలను తెస్తాయి.

కుల ప్రాతిపదికపై రిజర్వేషనులు ఇచ్చినంత కాలం, కోరినంత కాలం కుల పిశాచిని పారద్రోల లేము. సౌకర్యాలు కోరే నిమిత్తం, వాటిని సాధించుకునేటందుకు, వాటిని పోకుండా ఆర్జి పెట్టుకోవడానికి కులాన్ని జ్ఞాపకం చేసుకొవాలి; కుల సంగాల నిర్మాణం సాగించాలి. కుల తత్వ ప్రాతిపదికపై ఆందోళన చేయాలి. ఈ పచ్చి నిజాన్ని విస్మరించటం శ్రేయస్కరం కాదు. అంత మాత్రాన రిజర్వేషనులు అక్కరలేదని భావం కాదు. కుల ప్రాతిక వద్దని మాత్రమే ఉద్దేశ్యం. అనగానే కేవలంఆర్థిక స్థితి గతులను బట్టి రిజర్వేషనులు కావాలా అనే ప్రశ్న వస్తుంది. అలా కాదు సామాజిక వెనుక బడిన తనాన్ని, విద్యా విషయిక వెనుకబడిన తనాన్ని గీటురాళ్ళుగా పెట్టుకొని ప్రత్యేక సదుపాయాలను, కుటుంబాన్ని "యూనిట్" గా తీసుకొని, ఇవ్వాలి. ఈ భావాన్ని ఇంకా తరచి చూడవచ్చును. ఒక అంశాన్ని గుర్తుంచుకోవాలి. కుల తత్వం అగ్ర వర్ణస్తులని చెప్పుకువే వారిదైనా, వెనుకబడిన జాతుల వారిదైనా తప్పే. కాగా వెనుకబడిన జాతుల కులతత్వాన్ని సానుభూతితో అర్ధం చేసుకో గలం. పైతరగతుల కులతత్వాన్ని ఎట్టి పరిస్తితుల్లో సహించలేము; సహించరాదు.

చివరకు మిగిలేది ఒకే ఒక మార్గం. ప్రేమ వివాహాలను పెంపొందించడం. కుల ప్రసక్తి లేకుండా, కట్నరహితంగా, పురుషాధ్యికతకు తావు

లేకుండా. జరిగే వివాహాలు, జాతి, భాష, దేశం, తెగ, మతం విటి ప్రసక్తి రాని వివాహాలు, స్త్రీ పురుషులిరొందురుల ఇష్టంపై ఆధారపడే వివాహాలు ఇతోధికంగా జరగాలి. వాటిని అభ్యుదయ వాదులందరూ ప్రోత్సహించాలి; బలపరచాలి.

ఒక చిన్న హెచ్చరిక. దేశంకోసం, పార్టీసేవ కొరకు, భారత జాతి సముద్ధరణ కొరకు, సంస్కరణోద్యమాభి వృద్ధి నిమిత్తం జరిగే పెళ్ళిళ్ళు, జరిపించే పెళ్ళిళ్ళు అనేక ఇబ్బందులను ఎదుర్కొగల పరిస్తితులున్నాయి. వధూవరులు సహకార్య కర్తలుగా స్నేహితులుగా, ప్రేయసీ ప్రియులుగా. ఆలుమగలుగా నిశ్చయించుకున్నపుడే ఆ వివాహరథం సాఫీగా సాగిపోతుంది. ఆ రథ చక్రాల క్రింద కుల వ్యవస్థ నలిగి పోతుంది.

## III

అంతా దైవేచ్ఛ. బుద్ధి కర్మాను సారిణి, మనం నిమిత్త మాత్రులం అంటూ నిష్క్రియా యోగంలో పడి నిర్వీర్యులమైపోతే కులవ్యవస్థను నిర్మూలంచలేము. కనుక సనాతనాచారాల విధ్వంసన జరపడం మన ప్రథమ కర్తవ్యం. దానికి పైపై సంస్కరణలు చాలవు. సంకల్ప బలంతో సమూల మార్పు జరగాలి. అప్పుడు మానవ ప్రయత్నం ద్వారా నూతన సమాజ ఆవిర్భావానికి నాంది ప్రస్తావన జరుగుతుంది. దానికి మనం కొన్ని నిర్దుష్ట కార్యక్రమాలు చేపట్టాలి. వ్యతిరేకతను ధైర్యంతో ఎదురించాలి. ముందుగా మతం యొక్క మౌలిక మార్పు లేకుండా కులవ్యవస్థను పెకలించలేము. కనుక మత విధ్వంసనం ఒక వైపు సాగుతుంటేనే కుల విధ్వంసనకు శాశ్వత పరిష్కారం జరుగుతుంది. అంతకన్నా ముఖ్యమైనది స్త్రీలలో గూడు కట్టుకొని వున్న మూఢాచారాల నిర్మూలన.

సగభాగమైన స్త్రీలలో అంటరానితనం, కులతత్వం నశించనిదే దేశానికి ప్రగతి లేదు. వారి అవివేకం వల్ల అభ్యుదయ వాదులైన భర్తలు, పిల్లలు,

కుటుంబ శాంతి కొరకు వెనుకంజ వేస్తున్నారు. కనుక ముమ్మందుగా స్త్రీలలో కులాభిమానాన్ని రూపుమాపే ప్రయత్నం భారీ ఎత్తున జరగాలి. తరతరాలుగా నరనరాల్లో జీర్ణించిన ప్రాచీన సాంప్రదాయాలు స్త్రీలలో నశించడం కష్టభూయిష్టం కనుక దానికి బ్రహత్తర కృషి జరగాలి. స్త్రీలలో సామాజిక స్పృహ కలుగనిదే ఈ కులతత్వ పిశాచాన్ని మట్టు పెట్టలేము.

మానవులంతా ఒక్కటే. వారిలో హెచ్చు తగ్గులు లేవు. నిచ్చెన మెట్ల సమాజం పనికిరాదు. రంగు భేదం, నివాసస్థలాల్లో, వృత్తులలో తేడాలున్నా అందరికీ ఒకేరకమైన హేతుత్వ శక్తి ఉన్నది అని మహిళాలోకంలో ఉధృతంగా ప్రచారం సాగించాలి. సైన్సు యొక్క మూల సూత్రాలను, శాస్త్రీయ పరిశోధనా ఫలితాలను వారికి తెలియచెయ్యాలి. కులాలనంటి పెట్టుకుని ఉండే ఆచార వ్యవహారాలు మానవ నిర్మితాలని, శాశ్వతాలు కావని స్త్రీ లోకానికి తెలియచెప్పాలి. ఇలాంటి ప్రయత్నం ప్రభుత్వం సరాసరి చేపట్టినా లేక స్వచ్ఛంద సంస్థలకు సాయంచేసినా ఫలప్రదమౌతుంది. సాంఘిక కార్యక్రమాలు సమాజం మొత్తం మీద సాగించటం ఒక ఎత్తు, మహిళాలోకంలో ప్రబోధించటం మరొక ఎత్తు. కులవ్యవస్థను సమూలంగా రూపు మాపడానికి కాకపోయినా సడలింప చేయడానికి కొన్ని ప్రణాళికలు వేసుకోవాలి. అవి రెండు రకాలు, ఒకటి దీర్ఘకాలికం రెండవది తాత్కాలికం. అలాగే ఒకటి రాజకీయచర్య, మరోటి సామాజిక కార్యక్రమం.

ముందుగా దీర్ఘకాలిక కార్యక్రమాల్ని గురించి చర్చిద్దాం, కులసంఘ నిర్మాణాన్ని రాజ్యాంగ రీత్యా నిషేధించటం మొదట మెట్టు కావాలి, అవసరమైతే చట్టాన్ని సవరించాలి. ప్రభుత్వ వ్యవహారాలలో, రికార్డులలో కులపు పేరు, ఊసు రాకుండా చేయటంలో తగు జాగ్రత్తలు తీసికోవాలి. కులప్రాతిపదికమీద సదుపాయాలను, సౌకర్యాలను, రిజర్వేషనులు అనే పేరుతోగాని, ఇతరత్రాగాని, ఇవ్వకుండా ఉండటం మంచిది. ఈ విధానాన్ని విద్య, ఉద్యోగం, గృహవసతి, వైద్యం, ఉచిత లేక చౌకధరలకు తిండిగింజలను సరఫరా చేయటం. వీటిని గురించి అమలు పెట్టటం లాంటివి అవి. వారికి

ఊరి చివర ఇళ్ళ స్థలాలు కేటాయించరాదు, మాలపల్లె, మాదిగెపల్లె అని వేరుగా చూడరాదు. అలా పిలువరాదు.

ఇక తాత్కాలిక ప్రాతిపదికలను గూర్చి ఆలోచిద్దాం. అందులో సామాజికంగా కులవ్యవస్థను మట్టుపెట్టేవి కొన్ని ఉన్నాయి. శర్మ, వర్మ, గుప్త, చౌదరి, నాయుడు, యాదవ లాంటి పదాలను పేర్ల చివర, తగిలించుకునే ఆచారాన్ని లేక పేర్లలో భాగంగా చేసుకునే పద్ధతిని విడనాడటం లాంటివి అవి. ముందుగా మన ఇంట్లో, స్నేహితుల మధ్య కులాంతర వివాహాలను, శాఖాంతర వివాహాలను ప్రోత్సహించడం, వాటిని ఈసడించక పోవటం, ఆ దంపతులను ఆదరించడం, వారికి మన అండదండలను అందించడం చాలా అవసరం. పాఠశాలల్లో, కబ్బులలో, ఇతరప్రజాసంఘాలలో కులభేదాన్ని గూర్చి ప్రస్తావించక పోవటం, ముఠాలు కట్టకపోవటం, వైరుధ్యాలు పెంచకపోవటం లాంటి విషయాలలో తగుశ్రద్ధవహించడం చాలా అవసరం. కులంలోని వారిని ఆత్మ బంధువులుగా,కులం వెలుపలి వారిని అన్యులుగాచూచే మనస్తత్వాన్ని మనం ముందుగా విడనాడడం అత్యవసరంగా భావించాలి. గ్రామాలలో, పట్టణాలలో, బస్తీలలో బ్రాహ్మణవీధి, కొస్తపేట, కమ్మబజారు, రెడ్డి స్ట్రీట్ లాంటి కులాన్ని సూచించే పేర్లనువదిలేసి వాటికి సంఘ సంస్కర్తల పేర్లు పెట్టటం మంచిది.

సహపంక్తి భోజనాలు చేసే సందర్భాలను అధిక సంఖ్యలో పెంచటం, ఆ భోజనాలను కులప్రాతిపదికపైగాక వృత్తిప్రాతిపదికపై ఏర్పాటు చేయటం చాలా అవసరం. ప్రతికులం వారు తమ కులం గొప్ప అనే పొరపాటు అభిప్రాయాన్ని, తమ కులం తక్కువది అనే ఆత్మన్యూనతా భావాన్ని విడనాడడం, కులపు ఊసుతో మాట్లాడడం లాంటివి విరమించటం ముఖ్యమైన కర్తవ్యాలుగా భావించాలి పుట్టుక, పేరు పెట్టటం, పెండ్లిలాంటి శుభ సమయాలలో గాని, చావులాంటి అశుభ సందర్భాలలో ఏ ఒక్క ఆచారాన్ని సంప్రదాయాన్ని కులపు ఆచారమని, కుల సంప్రదాయమని ఆమోదించి అవలంబించకుండా మానవులందరికీ, సర్వులకూ, శుభకరమైన మంగళ ప్రదమైన పద్ధతులను చేపట్టటం జరగాలి. అలాచేస్తే కుల కట్టుబాటు తప్పకుండా సడలుతుంది.

కులంనుండి వెలివేసే ప్రయత్నాలను, ఆచారాలను సిరసించి విడనాడే ప్రయత్నాన్ని మనం ముందుగా ఆచరించాలి.



రాజకీయాలలో, ప్రజా సంఘాల ఎన్నికలలో కుల ప్రస్తావన లేకపోవటం, కుల ప్రాతిపదికమీద అభ్యర్థులను ఎంపిక చేయకపోవటం వారిని బలపరచకపోవటం కూడా తప్పక జరగాలి. ప్రజారంగాలైన కార్మిక, కర్షక రంగాలలో ఇంకా కళా, సాంస్కృతిక విద్యారంగాలలో, వృత్తి సంఘాలలో, కుల ప్రాతిపదికమీద సంఘాల నిర్మాణాన్ని నిరుత్సాహం పరచడం, వ్యతిరేకించడం లాంటివి తప్పని సరిగా వెన్వెంటనే అమలు జరగాలి. రాజ్యాంగ రీత్యా కొన్ని ప్రాతిపదికలు, సవరణలు జరిగితే తప్ప కుల వ్యవస్థ సమసిపోదు.



రిజర్వేషన్లను కుల ప్రాతిపదికపైగాక ఇతర గీటురాళ్ళపై, ఆర్థిక వెనుకబడిన తనాల ఆధారంగా నిర్ణయించటానికి ప్రయత్నాలను చేపట్టటం, మార్గాలను అన్వేషించటం అత్యవసరంగా భావించాలి. కుల ప్రాతిపదికపై గృహనిర్మాణాన్ని చేయడం, సౌకర్యాలను, సదుపాయాలను కల్గించడం మానాలి, అలాగే పేటలను, బస్తీలను, గ్రామాలను, పట్టణాలను, నిర్మించేటప్పుడు కుల ప్రాతిపదికను విస్మరించాలి. ఎన్నికలలో కుల సంఘాల పేరుతో అభ్యర్థులు పోటీ చేయటాన్ని నిషేధించాలి. ప్రభుత్వ పాఠశాలల్లో కళాశాలల్లో, విద్యార్థి వసతి గృహాలల్లో, శరణాలయల్లో, ఆవాస శిబిరాలలో కుల ప్రాతిపదికను తొలగించాలి. పాఠ్యంశాలలో అగ్రవర్ణం అనే పదాన్ని తొలగించాలి. కులపు పేరుతో నడిచే పాఠశాలలకు, కళాశాలలకు, విద్యార్థి వసతి గృహాలకు, శరణాలయాలకు, శిక్షణాలయాలకు, రక్షణ గృహాలకు, ఆవాస శిబిరాలకు ప్రభుత్వం ధనరూపేణ, వస్తురూపేణ, గ్రాంట్లు సహాయం, సహకారం నిలిపి వేయాలి. వాటికి సంబంధించిన ఉత్సవాలకు మంత్రులు, ప్రజాప్రతినిధులు, ప్రభుత్వాధికారులు హాజరు కారాదు, ప్రోత్సహించరాదు. పాఠ్య గ్రంథాలలో కులాలను ఈసడిస్తూ కుల ప్రాతిపదికను బట్టి నిరసిస్తూ చేసిన రచనలను తొలగించాలి కులపు ఉనికిని వరోక్షంగా గాని, ప్రత్యక్షంగా గాని బలపరిచే పోకడల వ్యతిరేకించాలి.

కులవ్యవస్థ నిర్మూలనకు చేపట్టి తగిన కార్యక్రమాల గూర్చి ముందుగా ప్రస్తావిద్దాం. పిల్లల్ని కుల ప్రసక్తి లేకుండా పెంచడం మొదటి మెట్టు కావాలి. రిజర్వేషన్లు ఆర్థిక, సాంఘిక పరిస్థితులను బట్టి ఇవ్వాలి. కాని వెనుకబడిన కులాల పేరుతో ఇస్తే మళ్ళీ మరోరూపంలో కులాన్ని పోషించి నట్లు అవుతుంది. మీ కులమేది అని అడిగితే మాకు కులం లేదని చెప్పడం మొదలు పెట్టాలి. ఏదైనా దరఖాస్తుఫారం పూర్తి చేసేటప్పుడు కులం అనే దాని కెదురుగా "లేదు" అని వ్రాయటం. బ్రాహ్మణ హోటళ్ళు. కమ్మ హోటళ్ళు అనే బోర్డులపై శాఖాహారం, మాంసాహారం అని వ్రాయటం, విద్యాబోధన జరిగేటప్పుడు కుల వ్యవస్థ ఎలా పుట్టిందో, ఎలా పెరిగిందో స్వప్రయోజన పరులు ఎలా వాడుకుంటున్నారో విద్యార్థులకు విడమరచి చెప్పాలి. వర్ణాంతర వివాహాలను ప్రోత్సహించడానికి విద్యాలయాల్లో అవకాశాలు కల్పించాలి. బహిరంగ ప్రదేశాలలో కులాంతర వివాహాలు జరిగినప్పుడు మనం, అధికారులు, అనధికారులు, సంస్కర్తలు హాజరై వారిని ప్రస్తుతించాలి. ఇది సమగ్ర ప్రణాళిక కాదు; సూచన మాత్రమే. మార్గాన్ని, ప్రయత్నాలను సూచిస్తుంది. వీటిని కనీసం ఆలోచించడానికి ఇష్టపడకపోతే, చేపట్టటానికి నిరాకరిస్తే కులతత్వం యెడ వ్యతిరేకత లేనట్లే లెక్క.

కులతత్వం మంచిదని, ఉండాలని చెప్పటం ఒక ఎత్తు. అది మంచిది, కాదని, నింద్యమని, గర్హ్యమని చెప్తూ దాని ఉనికిని పరోక్షంగా రక్షించ పూనటం మరియొక ఎత్తు. రెండవ మార్గంలో చిత్త శుద్ధి లోపిస్తుంది. అంతే గాదు, వంచన కూడా ఉంటుంది. ఎట్టి పరిస్థితులలోను ఆ విధానాన్ని ఆమోదించలేము. ఇంటిలోని దొంగ ప్రమాదకారి కదా! బహిరంగ శత్రువులను, ఎదుర్కోవటం తేలిక. అంతర శత్రువులను, పంచమాంగ దళాన్ని జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలి. ఈ సమస్య పరిష్కారానికి మేధావులు, ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు సంస్కర్తలు ప్రజలు కలిసి కృషిచేయాలి. తాత్విక సాంఘీక, రాజకీయ విధానాల ద్వారా ఆచరిస్తూ, సంస్కరించాలి. ఇలా సర్వులూ కలసి భారీ ఎత్తున ఉద్యమాన్ని నిర్వహించి, ఆచరించిన నాడే కుల వ్యవస్థ నిర్మూలన జరుగుతుంది.